JAGATI Rs. 2-00 March 1988

33rd Year of Publication

# జగతి

ఎడిటర్: చందూర్

మార్చి - 1988



'మార్చి ఎనిమిది ప్రపంచ మహిళా దినం'

—'సోవియట్ భూమి' సౌజన్యంతో

'జ గ తి' - 2, కచేరీ రోడ్, మైలాపూర్, పి బి 2922, మద్రాసు - 600 004
ఫోన్ : 76697 – సం॥ చందా రు. 24–00. 2 సం॥లకు రు. 45-00. 5 సం॥లకు
రు. 100-00. జీవిత చందా రు. 300–00. విదేశాలకు 2 సం॥లకు రు. 100-00

ముఖచిత్రం: బొల్షాయ్ నర్తకి

# నిమ్మతొనలు

నేను గత రెండేళ్ళుగా 'రాధా, మిమ్మల్ని ప్రేమిస్తున్నాను ప్రేమిస్తున్నాను' అంటూ ఇప్పటివరకు అరవై ఉత్తరాలు వ్రాశాను. కాని మీరు సమాధానం వ్రాయలేదు. ఈ సారి నన్ను ప్రేమిస్తున్నదీ లేనిదీ ఏ విషయం వ్రాయకపోతే, నేను ఉరేసుకుఛస్తాను - అంటూ ఉత్తరం వ్రాశాడు శేఖర్, కలం స్నేహితురాలు రాధకి.

"చూడండి శేఖర్, మీరు గత రెండేళ్ళుగా నన్ను ప్రేమిస్తున్న మాట నిజమే - కాని, గత ఇరవైఏళ్ళుగా నన్ను ప్రేమిస్తున్న కలం స్నేహితులు చాలామంది ఉన్నారు. ముందువాళ్ళ సంగతి తెమలనివ్వండి.... అంతవరకు దయచేసి ఉరివేసుకోవద్దు" అని రాధ జవాబిచ్చింది.

—రమ్యప్రియ
జగ్గయ్యపేట

ఏమండి మనం షష్టిపూర్తి చేసుకుందామండీ అంది సువర్చల. మీనాన్న మళ్ళీకట్నం ఇస్తే చేసుకోడానికి నాకు అభ్యంతరం లేదు.

—ఎమ్ వీరేశ్వర్రావు
అమలాపురం

నాన్నోయ్, వీడు భారతదేశాన్ని పాడుచేసేస్తున్నాడు - ఫిర్యాదు చేశాడు చిన్న కొడుకు.

'కాదు నాన్నా తమ్ముడే ప్రపంచాన్ని ముక్కలు చేస్తున్నాడు' - అని పెద్ద కొడుకు.

'ఏమిట్రా మీ గోల ?' కోప్పడ్డాడు తండ్రి.

'అబ్బే ఏం లేదండి - మ్యాప్‌లు పాడుచేస్తున్నారు' అని చెప్పింది తల్లి.

—బి వెంకటేశ్వర్రావు
రుద్రారం

సముద్రాన్ని పెట్రోలుగా మారుస్తానని శపథంచేసి, తీరా సమయం రాగానే తప్పించుకుంటారేం ?' - ఓ స్వామిజీని భక్తుడు అడిగాడు.

'ఎవరైనా కొంటెకుర్రాడు సిగరెట్ కాల్చిపడేస్తే ఎలా ?' - సెలవిచ్చాడు స్వామీజీ.

—కె నాగేశ్వరరావు
నరసరావుపేట

స్పెషల్ బిర్యాని వండుతున్నావు ఎవరికి, వదినా ? - ప్రశ్నించింది తాయారు.

'మా ఆయనకి' - జవాబిచ్చింది సుశీల.

'ఏదన్నా విశేషమా ?'

'ఇవ్వాళ మా ఆయన నిరాహార దీక్షలో పాల్గొనటానికి వెళ్తున్నారు కదా - అందుకని'.... అసలు సంగతి చెప్పింది సుశీల.

—భవాని
మచిలీపట్నం

అమ్మా, పక్కింటి బేబి తుమ్మకుండా ముక్కుకి క్లిప్పులు పెట్టాను - గొప్పగా చెప్పాడు ఆరేళ్ళబుజ్జి.

'వెధవా, అంతపని ఎందుకు చేశావురా' కోపంగా కసిరింది తల్లి.

'నిన్న నువ్వేగా చెప్పావ్, ఆ అమ్మాయిది తుమ్మితే ఊడిపోయే ముక్కని ! అందుకే ముందు జాగ్రత్తగా అలా చేశాను' వివరించాడు బుజ్జి.

—జి రాము
నందిగామ

ఒరేయ్ రామూ - ఇపుడు టైమ్ ఎంత అయిందో తెలుసా ? - ప్రశ్నించాడు మాష్టారు.

'పదిహేను అయిందండి' (వాళ్ళ నాన్న రైల్వేలో పనిచేస్తున్నారని వాడి బడాయి)

—వి నరసింహస్వామి
రాజమండ్రి

బాబూ ఈ హాల్లో ఏం సినిమా ఆడుతున్నది ?' - అని అడిగాడు ఓ పట్నం బాబుని వెంకయ్య.

'దొంగ' అన్నాడు పట్నంబాబు.

'ఏం నాయనా ఏం సినిమా అని అడిగితే నన్ను పట్టుకుని దొంగ అంటావా ? ఏం మనిషివయ్యా' అని విరుచుకుపడ్డాడు వెంకయ్య.

—వి భాస్కరరావు
కొణకంచి



# పాఠకుల తీర్పు

శ్రీ చందూర్ గార్కి నమస్తే: మద్రాసు వచ్చినపుడు మీతో చాలా విషయాలు మాట్లాడాలనుకున్నాను - కాని, కుదరలేదు. ఈ రోజుల్లో రచయితల పేర్లనుబట్టి రచనలు వేస్తున్నారు — రచనలు బట్టి కాదు! ఆనాటి కొనాడు విలువలు క్షీణిస్తున్నాయి.

—ఎ రంగ
విశాఖ-18

గౌరవనీయులగు శ్రీ చందూర్ గార్కి హృదయపూర్వక నమస్కారములతో వ్రాయునది. ఆగస్టు, సెప్టెంబరు సంచికలు రెండూ ఒకేసారిగా అందాయి. ముఖ్యముగా ఆగస్టు సంచికలో పాఠకుల తీర్పులోని జి. రాము (నందిగామ) వుత్తరంలో హైదరాబాదులో మీకు జరిగిన నష్టం గురించి చదివాను.... ఆ విషయం ఏమిటో తెలుసుకొనాలి అని ఆరాటంగా వుంది - దయతో ఆ విషయం తెలియచేయగలరు - ఎదురుచూస్తూ వుంటాను.

—అమ్మాజీ సర్కార్
ఆల్ ఖొబార్ - కెఎస్ఎ

ఎడిటర్ చందూర్ గార్కి నమస్కారములు. 'జగతి' చాలా విజ్ఞానయుతమైన పత్రిక. అనేక కొత్త విషయాలు తెలుస్తున్నాయి. ప్రతి పేజీ ఆసక్తికరంగా ఉంటున్నది.

—ఎస్ గణేష్
ఎర్రుపాలెం

శ్రీ చందూర్ గారికి నమస్సులు: చి॥ సుధారాణి గానం మీరిదివరలో విని మున్నారు - అమ్మాయి గూర్చి 'జగతి'లో ముఖచిత్ర వ్యాసం ప్రచురించి అభిమానించారు. సుధారాణికి 'ఆకాశవాణి'లో 'ఎ' గ్రేడు లభించిందని తెలియజేయడానికి సంతోషిస్తున్నాను. గత రెండేళ్ళలోను అమ్మాయి సాధించిన విజయాలను పొందుపరుస్తూ ఒక పత్రం తయారు చేశాను- దానిని మీకు పంపుతున్నాను. చి॥ సుధారాణి మద్రాసులో కొంత పరిగణన సాధించింది - ప్రారంభంనుండి మీరు అమ్మాయిని అభినందిస్తున్నారు. కనుక ప్రత్యేకంగా మీకు కృతజ్ఞతలు.

—ఎ రమణమూర్తి
విజయనగరం.



స్వభావంలో ఔన్నత్యం లేనప్పుడు, 'అవసరం' మనుషులని పాశవికులుగా చేస్తుంది. -- హొరేస్

# ప్రాచీన సాహితి




కలితదుకూల వస్త్రములు గట్టిన నీకును జీర్ణవల్కలం
బులు ధరించు మాకును బ్రమోదము తుల్యము లేదు వాసి య
గ్గల మగు తృష్ణ యెవ్వనికి గాఢదరిద్రుడు వాడు లేమియుం
గలిమియు నెల సమ్మద వికస్వర మానసులైన వారికిన్

—భర్తృహరి

అవనిలో గల యాత్ర లన్ని జేయగవచ్చు
ముఖ్య మౌ నదులందు మునుగ వచ్చు
ముక్కు పట్టుక సంధ్యమొనసి వార్చగ వచ్చు
దిన్నగా జపమాల ద్రిప్ప వచ్చు
వేదాల కర్థంబు విజివి చెప్పగ వచ్చు
శ్రేష్ఠ క్రతువు లెల్ల జేయ వచ్చు
ధనము లక్షలు కోట్లు దాన మియ్యగ వచ్చు
నైష్ఠి కాచారముల్ నడప వచ్చు
జిత్త మన్యస్థలములందు జేరకుండ
నీ పదాంభోజముల యందు నిలుప రాదు
భూషణవికాస శ్రీధర్మ పుర నివాస
దుష్టసంహార నరసింహ దురితదూర

-నరసింహ శతకం

గయలో గాశి బ్రయాగ శ్రీగిరిని గంగాద్వార నీలాచలో
జ్జయినీ ద్వారకలం దయోధ్య మధురన్ సంస్తుత్య పుణ్యస్థలా
గ్రీయతన్ వెండియు మించు నైమిశ కురుక్షేత్రాదులం దర్పణ
క్రియచే నా పినతమ్ము డెట్టిన యొనర్చెన్ దంద్రికాహ్లాదమున్

—పింగళి సూరన

# పాతికేళనా పిక్చర్

## చిత్రకళా వారి 'కానిస్టేబుల్ కూతురు'

చలనచిత్ర రంగంలో సామాజిక వాస్తవికతకు ఎంతవరకు అవకాశ మున్నదనే విషయాన్ని విమర్శకులు చాలాకాలంగా తర్కిస్తున్నారు. ఒక వైపున, సినిమా ఒక వినోదం, భారీ వ్యాపారంతో కూడిన వినోదం యిది ప్రజలను రంజింపజేయగలదే తప్ప అంతకుమించిన ప్రయోజనాన్ని సాధించ లేదు - అంటున్నారు. మరొకవైపున, పలాయన తత్వానికి చెందిన వినోదంగా దీనిని రూపొందించి, ప్రజలను యింకా మందకొడులుగా చేయవద్దు; ప్రజా హృదయాన్ని మేల్కొలిపి వారిని సచేతనులుగా చేయగల మహత్తరాయుధ మిది అంటున్నారు. ఈ రెండోతరహా వారే చిత్రాలలో సామాజిక వాస్తవికత కావాలనేది. లేనిపక్షంలో, అవి శుష్క వినోదాలవుతాయని వీరి విశ్వాసం......

....'కానిస్టేబుల్ కూతురు' మన సినిమా చరిత్రలో ఒక మైలురాయి అనవచ్చు. సంఘ స్వరూపాన్ని, సమాజశక్తుల విజృంభణనీ ఈ నిర్మాతలు కళాత్మకంగా, ప్రగతిశీలకంగా చూపగలిగారు. ప్రగతిశీలం అనగా ఏమిటి?- అని అడగవచ్చు. ఇందులో మాటవరసకు ధర్మయ్య (గుమ్మడి) పాత్ర, తన యిరవై మూడేళ్ళసర్వీసులోనూ ఏనాడూ అరకప్పు కాఫీకూడా లంచంగా పుచ్చుకు ఎరగని కానిస్టేబుల్‌ని, చివరి దృశ్యంలో 'నీవు లక్షాధికారి కొడుకుని అల్లునిగా చేసుకుందామను కున్నావా?' అని మల్లిక తండ్రి (మిక్కిలినేని) నింద మోపగా, ధర్మయ్య చలించడుగాని, అవినీతికి హద్దులు లేవా?- అని మనం ఆశ్చర్యపోతాం. కళ్ళల్లో కన్నీళ్ళెందుకో చెప్పి మనకి కన్నీరు తెప్పించే కానిస్టేబుల్ కూతురు జానకి (కృష్ణకుమారి) వంచకులను మన్నించగల మంచితనమనే కరదీపికతో చుట్టూ జీవితాలను ప్రభావితం జేసి, విలాస యువకుడు రఘు (కాంతారావు)లో చిత్తక్షోభ రగుల్కొల్పుతుంది. అనవసర సన్నివేశం మచ్చుకి ఒక్కటికూడా లేని ఈ ప్రయోజనాత్మక చిత్రాన్ని తెలుగు ప్రజలు ఆదరించగలరని నమ్ముతున్నాం. ధర్మయ్య పోలీసు శాఖకు మకుటాయమానం - ఆ కానిస్టేబుల్ కూతురు భారతనారీ హృదయ ప్రసూనం.

—యన్నార్ చందూర్ సమీక్ష
'జగతి'—మార్చి 1963

---

నమ్మక ద్రోహం కంటె ప్రత్యక్ష వైరం ఎంతో మంచిది. —జాన్సన్

ఆదర్శమనేది లక్ష్యసిద్ధికి తప్ప మరింకే శాసనానికీ బొడబడదు.

—థామస్‌హార్డి

# వెన్నెల కెరటాలు

## కోటిరత్నాల వీణ

నా తెలంగాణ కోటిరత్నాల వీణ - అని చాటి, నిజాం నిరంకుశ పరిపాలనలో ప్రజల పక్షాన నిలిచి తన కవిత్వంద్వారా తెలంగాణావిముక్తికి పాటుపడి నాజీ జైళ్ళవంటి నిజాం జైళ్ళలో క్రుమ్గి తన సర్వస్వం త్యాగం చేసి, తెలంగాణా విమోచనం జరుగగానే - కోటి తమ్ములకడ రెండు కోట్ల తెల్గుటన్నలను గూర్చి వృత్తాంత మంద జేసి మూడుకోటుల నొక్కటే ముడి బిగించి పాడినాడ మహాంధ్ర సౌభాగ్యగీతి' అని చెప్పుకో గలుగుటకై మహాంధ్రోదయం కొరకై కవిత్వాన్ని ఒక ఉద్యమంగా నడిపిన మహాకవి దాశరథి, సంస్కృతాంధ్రాంగ్ల ఉర్దూ పారసీ భాషలలో మంచి ప్రవేశం కలవారు. ఉర్దూ మహాకవి గాలిబ్ గజళ్ళను అదే విధమైన భావవ్యక్తీకరణతో వీరు చేసిన అనువాదం 'గాలిబ్ గీతాలు' శాశ్వత మూల్యం కలిగిన రచన. ఇంకా అనేక పరభాషా కవుల కవితలను వీరు తెనిగించారు. స్వయంగా తెలుగులో గజళ్ళ, రుబాయీలు ప్రయోగాత్మకంగా రచించారు. తెలుగులో పద్యాన్ని చక్కని ధారా శుద్ధితో ప్రౌఢరీతిలో వ్రాయగల కొద్దిమంది కవులలో దాశరథి ఒకరు.

—డి రామలింగం

'యోజన'లో

## సుగంధ ద్రవ్యాలు

భారతదేశంలో ఏడువేల సంవత్సరాల నుంచి సుగంధ ద్రవ్యాలు ఎగుమతి అవుతున్నాయి. ఇప్పుడు 26 రకాలు పండించి 116 దేశాలకు ఎగుమతిచేసి, 302 కోట్ల రూపాయలు విదేశీమారక ద్రవ్యం పొందుతున్నాం. అయితే దీనిలో 70 శాతం మిరియాల నుంచి వస్తోంది. ధనియాలు, జీలకర్ర లాంటి గింజలు, జాజికాయలాంటి పండ్లు, దాల్చినచెక్క, కర్రీలీఫ్ రసాయనాలు, అత్తరులు లాంటివన్నీ ఉత్పత్తి చేస్తున్నారు. 1980లో 92 వేల టన్నులు ఉత్పత్తి చేసి 155 కోట్ల రూపాయలు ఆర్జించగా, 1986-87లో 83,847 టన్నులకు తగ్గినా 302కోట్ల ఆదాయం పొందగలిగాము. ఆంధ్రప్రదేశ్‌లో 7 లక్షల ఎకరాల్లో పండే 80 లక్షల 70 వేల టన్నుల మిర్చిలో 98 శాతం దేశంలోనే ఖర్చవుతుంది. 1-2 శాతం మాత్రమే ఎగుమతి అవుతుంది. సీమమిరపకు (బర్డ్ ఐ చిల్లీస్) ఎక్కువ డిమాండు

వుంది. పండే పసుపులో 8 నుంచి 10 శాతం మాత్రమే ఎగుమతి చేస్తున్నారు. విదేశాలకు కావలసిన పసుపులో సగం భారతదేశం నుంచి ఎగుమతి అవుతుంది.

—వ్యాసభాగం
'అన్నదాత'లో

## పతాకం

పతాకమంటే స్తంభానికి చుట్టుకుని రెపరెపలాడేది కాదు. పతాకమంటే ఒక నమ్మకానికి, ఒక కుటుంబానికి, ఒక జాతికి లేదా ఒక దేశానికి చిహ్నం. ఈ పతాకం కోసం, తమ ఆత్మ గౌరవం కోసం జనం తరతరాల నుండి ప్రాణాలర్పించారు.... ఆదిమ మానవుడు తన కుటుంబాలకి 'హెూర్డె' అనే పేరు పెట్టుకున్నాడు. కొన్ని సంవత్సరాల తర్వాత కొన్ని తెగల పేరు 'హెూర్డె గా' మారింది. ఈ పేరు పుణికి పుచ్చుకున్న వారిని 'టోటెమ్స్' గాను వ్యవహరించేవారు. తమ నివాసాలకు సమీపంలో 'టోటెమ్' స్తంభాలను నిలబెట్టడం ద్వారా తమ పునికిని ప్రత్యేకతని చాటుకునేవారు. ....పతాకానికి భారతీయ పరిభాష ఏమిటంటే ధ్వజం. ధ్వజం అనే పదం మూడు విషయాల్ని సూచిస్తుంది. పతాకం — అంటే గాలికి రెపరెపలాడే బట్ట; కేతువు - అంటే దాని మీద చిత్రించబడిన చిహ్నం. యాస్తి - అంటే పతాకాన్ని ఎగురవేసే కర్ర లేక స్తంభం.

— లెఫ్టినెంట్ కమాండర్
కెవి సింగ్
'సైనిక సమాచార్'లో



# మానవ ప్రగతి

## నైనో'

దక్షిణ అమెరికా సముద్ర తీరంలో భూమధ్యరేఖకు సమీపం నుంచి మొదలవుతున్న 'ఎల్ నైనో' అనే ఒక వాతావరణ వైపరీత్యం ప్రపంచంలోని పెక్కు ప్రాంతాలలో తీవ్ర దుర్భిక్షానికి, వరదలకు, పెనుతుపానులకు, వాతావరణంలో అసాధారణమైన వేడిమికి దారితీస్తున్నది. ఈ 'ఎల్ నైనో' కారణంగా అయిదేళ్ల క్రితం డిసెంబరు నెల 2వ తేదీన కాలిఫోర్నియాలో జరిగిన ఒక సంఘటన ఆశ్చర్యం కలిగిస్తుంది. ఆవేళ 'లా జొలా' సముద్ర తీరంలోని ఒక హోటల్‌లోకి హఠాత్తుగా పెద్ద పెద్ద సముద్రపుటలలు ప్రవేశించి అందులోని వస్తువులన్నిటిని సాగర గర్భంలోకి లాక్కుపోయాయి. ఈక్వడార్ తీరం వద్ద పసిఫిక్ మహాసముద్ర జలాల ఉపరితలం ఉష్ణోగ్రతలో 11.8 డిగ్రీల సెల్సియస్ మేరకు పెరుగుదల ఏర్పడడంతో 'లా జొలా' వద్ద సముద్రం ఇలా వున్నట్టుండి పొంగినట్టు పరిశోధకులు తర్వాత తెలుసుకున్నారు. 1982లో 'లా జొలా' ప్రాంతంలోని ఈ సంఘటనకు తోడుగా 1982, 1983లో ప్రపంచంలో వివిధప్రాంతాలలో మరికొన్ని అరుదైన వాతావరణ విచిత్రాలు జరిగాయి. 'తహితి' అప్పటికి అర్థశతాబ్దంగా 'టైఫూన్' తాకిడిని చవిచూసి ఎరుగదు. కాని ఆ సీజన్‌లో ఆ ప్రాంతాన్ని ఆరు టైఫూన్‌లు అతలాకుతలం చేశాయి. అదే సీజన్‌లో 'పెరూ' చరిత్రలోకెల్లా అతి భారీ వర్షం కురిసింది; అక్కడ సాధారణంగా 15 సెంటిమీటర్ల వర్షపాతం నమోదయ్యే ప్రాంతాలలో 3.3 మీటర్ల వర్షం పడింది; కొన్ని నదులు తమ సాధారణ ప్రవాహానికి 1,000 రెట్లు ఎక్కువ నీటితో ఉరకలెత్తాయి. ఆ సీజన్‌లోనే (1982-83) ఆస్ట్రేలియా, ఆఫ్రికా, ఇండోనీసియాలు తీవ్ర దుర్భిక్షాన్ని, ధూళి తుపానులను, కార్చిచ్చులను ఎదుర్కొన్నాయి. వీటన్నిటికీ కారణం - ఆ సీజన్‌లో ఏర్పడిన 'ఎల్‌నైనో' అనే వాతావరణ వైపరీత్యమని పరిశోధకులు నిర్ణయించారు. అయితే, 'ఎల్ నైనో' అనగా ఏమిటి ? ఈ 'ఎల్‌నైనో' సంఘటనలు ప్రతి కొద్ది సంవత్సరాలకు ఒక పర్యాయం వంతున ఏర్పడుతూనే వున్నాయట.

1541 నుంచి ఇవి సంభవిస్తున్నట్టు నమోదైంది. తొలుత 'ఈ ఎల్ నైనో' కేవలం ఈక్వడార్‌కి మాత్రమే పరిమితమని భావించేవారు. అక్కడ ఏటా డిసెంబరు నెలాఖరు ప్రాంతంలో సముద్ర జలాలు స్వల్పంగా వేడెక్కుతుంటాయి. స్పానిష్ భాష మాట్లాడే స్థానిక జాలరులు ఈ పరిణామానికి 'ఎల్ నైనో' (ది లిటిల్ వన్) అని పేరుపెట్టుకున్నారు. ఇది ఏర్పడిందంటే ఇక అది తమ చేపల వేటకు ప్రతికూలమైన సంవత్సరమని అక్కడి జాలరులు భయపడతారు. సాగర జలాలు వేడెక్కడంతో ఆ ప్రాంతంలోని చేపలు చనిపోవడం, లేదా మరో ప్రాంతంలోని లోతట్టు జలాలలోకి వలస వెళ్లిపోవడం జరుగుతుంది.

## వానపాములు

సంచార జీవనాన్ని సాగిస్తున్న మానవుడు ఎట్టకేలకు వ్యవసాయదారుడైనాడు. ఆ తరువాత మరలా తిరిగి చూడటం జరగలేదు. వ్యవసాయం ద్వారా పట్టణాభివృద్ధి పారిశ్రామికరణ వంటి సాంఘిక ప్రగతిని సాధించడానికి వీలుకలిగింది. మొత్తం ప్రపంచ జనాభాకు జీవ జాతులకు ఆహారాన్ని సరఫరా చేస్తున్నది. నీరు, సూర్య కాంతీ, ఎరువులు, సస్యరక్షణ మందులు వ్యవసాయానికి అవసరం. కానీ చాలా పంటలు పండించడంలో ఒక ముఖ్యకారకం భూమిలోనే నిరంతరం పనిచేస్తుంటుందని సాధారణంగా మనకు తెలియదు. ఈ కారకం భూమిలో నివసించే కొన్ని జీవజాతులు. ముఖ్యంగా వానపాములు.................ఈ పురుగులు, పాములు చాలా చోట్ల ఉంటాయి. వ్యవసాయ పరంగా సహాయం చేసేవి, చెరుపు చేసేవి కూడా ఉంటాయి. సహాయం చేసే పురుగులు బలహీన భూములను సారవంతం చేస్తాయి. చెరుపు చేసే పురుగులను నియంత్రించక పోయినట్లయితే అవి వ్యవసాయానికి నష్టం కలిగిస్తాయి. వాన పాములు మానవునికి ఎంతో సహాయం చేస్తాయి. అవి మట్టిని తింటాయి కాబట్టి వాటి విసర్జక పదార్థాలు కూడా మట్టితో నిండి ఉంటుంది. అవి తినే మట్టికి మొక్కల పెరుగుదలకు సహాయపడే పోషక పదార్థాలను చేరుస్తాయి. వాన పాములు వ్యవసాయ భూమిని చదును చేసి, మట్టిని తేలికచేస్తాయి. అందువలన మట్టిని గాలితో నింపుతాయి. తక్కువ లోతుఉండే ఉష్ణప్రాంత భూములలో వానపాములు చాలా క్రియాశీలకంగా పనిచేస్తాయి. సారవంతమైన మట్టిని పూడ్చిచేసి, తక్కువ సారం గల మట్టిని పైకి తీసుకొనివచ్చే మెకానికల్ టిల్లర్లకంటే వానపాములు చాలా సమర్థవంతంగా పనిచేస్తాయి. మధ్య అమెరికాలోని మాయన్ మరియు ఆగ్నేయాసియాలోని ఖ్మేర్ నాగరికతలు ఉష్ణప్రాంత అడవులుతో ఉన్న పెద్ద నదీ పరివాహిక ప్రాంతాలలోనే అభివృద్ధి చెందాయి. మాయాన్ నాగరికత బాగా వర్ధిల్లిన ప్రాంతంగా భావించబడే మెక్సికో

నైరుతీ ప్రాంతాలలో వానపాముల వలన తయారైన బయోమాస్ హెక్టారుకు 400 కేజీలని నిర్ధారించారు. అందువలన పెద్ద మానవ ఆవాసాలు అభివృద్ధి చెందటానికి అవసరమైన వ్యవసాయ కార్యక్రమాలు, వానపాముల వలన ఏర్పడిన ఎక్కువ సాంద్రతగల బయోమాస్‌తో సంబంధ ముందని భావించవచ్చు.

## లేజర్లు

ఒకప్పుడు పరిశోధనా శాలలకు మాత్రమే పరిమితమనుకున్న 'లేజర్లు' ఇప్పుడు అమెరికన్ల జీవితంలో ఒక భాగమై పోయాయి. శక్తివంతమైన కాంతిని ఉత్పత్తిచేసే ఈ లేజర్ పరికరాలు వైద్య, వాణిజ్య, వినోద, పారిశ్రామిక రంగాలలో ముఖ్యమైన అన్నిచోట్ల కనిపిస్తున్నాయి. ఒక అమెరికన్ - ఫోన్‌కాల్ చేసినా, సూపర్ మార్కెట్‌లో షాపింగ్ చేసినా, ఒక క్రెడిట్ కార్డుని వినియోగించినా, ఒక స్టీరియో సెట్‌ని 'ఆన్' చేసినా.... అందులో 'లేజర్' పాత్ర వుండి తీరుతోంది. పారిశ్రామిక రంగంలో లేజర్లు యంత్రపరికరాల రూపకల్పనకు, సున్నితమైన విడిభాగాల తనిఖీకి, లోహపదార్థాలను కత్తిరించడానికి, పెక్కు ఇతర కార్యక్రమాలకు ఉపయోగపడుతున్నాయి. వైద్య రంగంలో అంధత్వ నిరోధానికి, ప్రేవులలో రక్తస్రావాన్ని ఆపడానికి, పెక్కురకాల శస్త్రచికిత్సలు జరపడానికి లేజర్లను వినియోగిస్తున్నారు... ....కాగా, ఇదంతా లేజర్లకు సంబంధించిన పాత కథ కిందే లెక్క అని, భవిష్యత్తులో లేజర్ ప్రాతిపదికగా గల 'కంప్యూటర్ మెమొరీస్' రూపొంది ప్రపంచ విజ్ఞాన సర్వస్వా లన్నింటిని ఒకే ఒక్క 'డిస్క్' మీదికి ఎక్కించగలుగుతాయని నిపుణుల పేర్కొంటున్నారు. 'లేజర్' అనేది 'లైట్ యాంప్లిఫికేషన్ బై స్టిమ్యులేటెడ్ ఎమిషన్ ఆఫ్ రేడియేషన్' అనే దానికి హ్రస్వనామం. ఎలెక్ట్రాన్లను ఒక ప్రత్యేక తరహా కాంతిని వెలువరించేలా మార్పు చేయవచ్చునని అల్బర్ట్ ఐన్‌స్టయిన్ 1916లో తొలిసారిగా ఊహించారు. 1960లో థియొడోర్ మైమన్ అనే అమెరికన్ ఇంజనీర్ దీనిని వాస్తవ రూపంలోకి తెచ్చి నిర్ధారించారు. మైమన్ తయారచేసిన తొలి 'లేజర్' కేవలం ఎరుపు రంగు కాంతిని మాత్రమే వెలువరించ డంవల్ల దాని ప్రయోజనం పరిమితంగానే వుండిపోయింది. కాగా నే కాంతిపుంజాలను వెలువరించడా వివిధ రకాల లోహపదార్థాలను వినియోగించే లేజర్లను ప్రత్యే ప్రయోజనాలకై వినియోగిస్తున్నా వైద్యరంగంలోని లేజర్లు దీనికొ ఉత్తమ ఉదాహరణ అని చెప్పవచ్చు నేడు అమెరికాలోని ఏ పెద్ద వైద్య కేంద్రంలోకి వెళ్లినా అక్కడ రకాల శస్త్రచికిత్సలకు వినియోగిం కార్బన్‌డయాక్సయిడ్ లేజర్లు దర్శ మిస్తాయి. 'ఏరాన్' లేజర్ నీలిక తితో కంటి 'రెటీనా' లోని రంధ్రా

మూసివేస్తారు. అలాగే దాని సహాయంతో ,అంధత్వాన్ని కలిగించే గ్లాకోమాని కూడా నివారించగలుగుతున్నారు. 'యాగ్' లేజర్ ద్వారా పేగులలో అవరోధంగా ఏర్పడిన గడ్డలను కరిగించి వేస్తున్నారు..........
ఇలా వుండగా 'ఫైబర్ ఆప్టిక్స్ - లేజర్స్' కలయిక టెలికమ్యూనికేషన్ల రంగంలో కూడా అనూహ్యమైన మార్పులు తెస్తున్నది. ఈ ఏడాది 29 ఉత్తర అమెరికన్, యూరోపియన్ కంపెనీలు కలసి మొట్టమొదటి 'ట్రాన్స్ అట్లాంటిక్ ఫైబర్ ఆప్టిక్ కేబుల్'ని వేస్తున్నాయి. ఈ కేబుల్ ఒకే పర్యాయం 40 వేల టెలిఫోన్ సంభాషణలను నిర్వహించ గలుగుతుంది. ఇప్పటికి అత్యాధునికమైనదని భావిస్తున్న (1983లో వేసిన) రాగి కేబుల్ కేవలం 9 వేల సంభాషణలను మాత్రమే ఏకకాలంలో నిర్వహిస్తుంది. ఈ ఏడాది వేసే 'ఫైబర్ కేబుల్' లో 5,058 కిలోమీటర్ల దూరంలో కేబుల్స్‌ని, అమెరికన్ టెలిఫోన్ టెలిగ్రాఫ్ సంస్థ వేస్తుంది. ఈ కేబుల్‌కి ప్రతి 50 కిలోమీటర్ల దూరానికి సెమికండక్టర్ లేజర్లని ఏర్పాటు చేయడం ద్వారా 'లైట్ సిగ్నల్స్' ని ఎక్కడికక్కడ తిరిగి శక్తిమంతం చేసి ముమ్ముందుకు ప్రసారం చేస్తుంటారు. ఇప్పుడు 'ఫైబర్ ఆప్టిక్ లేజర్ సిగ్నల్స్' సెకండుకు 40 కోట్ల నుంచి 80 కోట్ల 'బిట్స్' ని ప్రసారం చేయగల సామర్థ్యాన్ని సంతరించుకున్నాయి. ముద్రణ రంగంలోను, త్రీ-డైమన్షనల్ చిత్రాలను సృష్టించే 'హెూలోగ్రఫీ' లోను కూడా లేజర్లు బాగా ఉపయోగపడుతున్నాయి.

## 'రివర్స్ ఆస్మాసిస్'

దేశంలోని ఐదు లక్షల గ్రామాలలో సగానికి పైగా గ్రామాలలో మంచినీటి కొరత తీవ్రమైన సమస్యగా ఉంది. ప్రభుత్వం తీవ్రప్రయత్నాలు చేస్తున్నప్పటికి, ఎంతో ఖర్చు చేస్తున్నప్పటికీ, ఈ సమస్య ఇంకా పెరిగి పోతూనే ఉంది. దీనికి తోడు రుతుపవనాలు సకాలంలో రానందువలన ఈ సమస్య తీవ్రతరం అవుతున్నది. కేరళ వంటి సదుపాయ ప్రాంతాలు కూడా మంచి నీటికొరతను ఎదుర్కొంటున్నాయి. నిరంతరం ఉప్పునీరు లేదా చవుటనీటి నందించే జలవనరులు దేశమంతటా విస్తృతంగా ఉన్నాయి. నీటిలో తేలియాడుతున్న పదార్థాలను తొలగించి, కావలసిన స్థాయికి మంచి నీటిని శుభ్రపరిచే ఒక పద్ధతిని హైదరాబాదులోని భారత్ హెవీ ఎలక్ట్రికల్స్ అభివృద్ధి పరిచింది. ఈ పద్ధతిని 'రివర్స్ ఆస్మాసిస్' అంటారు. నీటిలో కరిగిఉన్న కార్బన్ డయాక్సైయిడ్‌ను తొలగించటానికి ఈ నీటిని డీ-కార్బొనేటింగ్ టవర్ లోనికి పంపిస్తారు. తరువాత ఈ నీటిని తగిన పి.హెచ్. స్థాయికి తీసుకు రావటానికి క్షారగుణ రసాయన పదార్థాలతో విశ్లేషిస్తారు. రబ్బర్‌తో లైనింగ్ చేయబడిన కార్బన్-స్టీల్ పీడన పాత్రలలోపల పొరలో రివర్స్ ఆస్మాసిస్ జరుగుతుంది.




## 1987 డిసెంబరు 04

అక్టోబరు రెండో వారంలో గోపాల రెడ్డిగారు, 'డిసెంబరు అయిదో తేదీ ఉదయం మనం శ్రీ అరవిందుని సమాధి దర్శనం చేసుకోవాలి' అన్నారు. సరేనన్నాం – యిద్దరం. నవంబరు ఒకటో తేదీన హైదరాబాదులో ఉన్నప్పుడు ప్రశంగవశాన వాసిరెడ్డి సీతాదేవితో, మేము డిసెంబరు నాలుగో తేదీన గోపాలరెడ్డిగారితో, పాండుచ్చేరి వెళ్తున్నట్లు చెప్పాం. తను ఎప్పుడూ పాండుచ్చేరి వెళ్లలేదన్నారామె. నవంబరు మొదటివారంలో గోపాలరెడ్డిగారు మద్రాసు వచ్చినప్పుడు, సీతాదేవిని కూడా మనతో రమ్మందామా? – అని మాలతి సూచించగా 'దానిదేముంది, తప్పకుండా రమ్మనమనండి - రెండు రూములు బదులు మూడు రూములు రిజర్వ్ చేయమని రాస్తాను. ఒకవేళ రాజభవన్‌లో మూడు రూములు ఖాళీలేక పోతే, రెండిటితోనే సర్దుకుందాం. ఎల్లుండి హైదరాబాదు వెళ్తున్నానుగా - ఆమెని నేను ఇన్వయిట్ చేస్తాను' - అన్నారు.... మాజీ గవర్నరుగా రాజ్‌భవన్‌లో వుండగల సదుపాయం ఆయనకు ఉన్నప్పటికీ, హైదరాబాదు వెళ్ళినప్పుడు మిత్రులు అల్లాయుద్దీన్ యింట్లోనే ఉంటారు. ఆ కవితా ప్రపంచమూ, సంస్కృతీ ప్రభావమూ ఆయనకెంతో ప్రీతిపాత్రం. అలాగే మద్రాసు వచ్చినప్పుడు చెట్టినాడు హవుజ్! - ఆ చెట్టినాడు పాలెస్‌లోని వ్యక్తులు - యజమాని రామస్వామి మొదలు సామాన్య ఉద్యోగిదాకా - కనబరిచే గౌరవ మర్యాదలు, ఆదరాభిమానాలు స్వయంగా చూసిన వారికి తెలుసు; లేకపోతే అతిశయోక్తి అనుకుంటారు.... హైదరాబాదులో తెలుగు విశ్వవిద్యాలయ ద్వితీయ వ్యవస్థాపన దినోత్సవం రెండో తేదీ సాయంత్రం జరిగింది. తెలుగు సాహిత్యంపై విశ్వకవి రవీంద్రుని ప్రభావం గురించి డాక్టర్ గోపాలరెడ్డి ఉపన్యసించారు. మూడవ తేదీ ఉదయం ఫ్లయిట్‌లో ఆయన, జవహర్ బాలభవన్ డైరక్టర్ వాసిరెడ్డి సీతాదేవి మద్రాసు వచ్చారు. సీతాదేవిని మా యింట్లో దిగబెట్టి, ఆయన చెట్టినాడ్ పాలెస్‌కి వెళ్లిపోయారు.... డాక్టర్ శెల్వరాజ్ వద్దనుంచి ఆమె వచ్చేసరికి

నిన్నరాత్రి తొమ్మిదయింది.... ఉదయం ఏడున్నరకి వెహికిల్ వస్తుందన్నారు గనక, ఏడుంపావుకే రెడీ అయాము. ఏడూ ఇరవైకి కారు వచ్చింది; ఏడూ ఇరవై అయిదుకి బయల్దేరాము.... బయట వర్షపుజల్లు - కాని, లోపల ఎసి, కాసెట్ మ్యూజిక్. సరిగా తొమ్మిదిన్నరకి బ్రెడ్డూ, వేడి వేడి పాలూ, ఫ్రూట్సూ - బాస్కెట్ కారుతో బాటే వచ్చింది చెట్టినాడు హవుజ్ నుంచి.... కాసేపు మెలొడి కాసేపు మాటలు. పాండుచ్చేరి, మద్రాసుకి 170 కిలోమీటర్లు - కొన్నిచోట్ల రోడ్డు ఘోరంగా ఉంది. రాజభవన్ చేరుకొనేసరికి పదకొండుంపావు అయింది. ఫార్మర్ గవర్నరులకని కేటాయించిన స్వెటి (suite) గోపాలరెడ్డి గారి కిచ్చారు. మాముగ్గురికీ ఫస్ట్ ఫ్లోర్‌లో సువిశాలమైన గదులు, సామాను గదుల్లోకి రాగానే వేడి వేడి టీ తెచ్చిపెట్టిన బేరర్, పన్నెండున్నరకి లంచ్ రెడీగా ఉంటుందనీ, మాజీ గవర్నరు గారితో తీసుకుంటారా, యిక్కడికి తెచ్చిపెట్టమన్నారా - అని అడిగాడు. కిందకే వస్తామన్నాము. ఎడతెరిపి లేకుండా వర్షం కురుస్తోంది - ఈదురు గాలి మాత్రం లేదు. 'రాజనివాస్' ఆశ్రమ సమీపాన ఉండటంచేత, వచ్చీపోయే భక్తులు కనిపిస్తున్నారు. సీతాదేవికిది మొదట విజిట్, కాని, మాకు రెండో సారి. క్రితంసారి వచ్చినప్పుడు ఇంటర్నేషనల్ గెస్ట్ హవుజ్‌లో ఉన్నాం; ఆశ్రమ భోజనం చేశాం ; ఆ పద్ధతులూ అవీ చూసి ముగ్ధుల మయాము. ఎంతటివారూ తమలోని అహాన్ని జయించేందుకు, యింతకు మించిన మార్గం మరొకటేమున్నది, జీవన పరిపూర్ణతకు సేవాభాగ్యాన్ని మించిన సంపద వేరేమున్నదని అనుకున్నాం. 'ఇక్కడ వుండి పోవాలనిపిస్తోంది' - అన్నారు ప్రేమ్‌చంద్, 'అనిపించడమే తప్ప ఉండలే మేమో' - అన్నాను నేను. మా సంభాషణకి నవ్వుకున్నారు సత్యవతి, సరోజిని, మాలతి. కొన్ని కొన్ని పర్యాటకానుభవాల పరిమళ తరంగాలు నవనవోన్మేషములు.... రేపు సాయంత్రం నాలుగు గంటలకి పాండుచ్చేరి నుంచి బయలుదేరేదాకా, మా ప్రోగ్రామ్ ఏమిటో శ్రీనికేతన్ ట్రస్ట్‌వారి టైపెడ్ షీట్ వచ్చింది..... ఒంటి గంటకు లంచ్, మూడు గంటలకు దయాకర రెడ్డి వచ్చి ఆశ్రమానికి, వారింటికి 'టీ'కి తీసుకు వెళ్తారు. ఒక గంట విశ్రాంతి తీసుకు, లిఫ్ట్‌లో కిందకి దిగాము. అప్పటికే దయాకర్ వచ్చి ఉన్నారు.... ఆశ్రమానికి వెళ్లాం - మహాసమాధి వద్ద అగరుధూపం వెలిగించి, పువ్వులు సమర్పించాము. ధ్యానమందిరంలో కాసేపు నిలబడి, బుక్‌షాపుకివచ్చి పుస్తకాలూ గ్రీటింగు కార్డులూ తీసుకు దయాకరరెడ్డి తల్లి కృష్ణమ్మగారింటికి 'టీ'కి వెళ్లాము. దయాకరరెడ్డి తలిదండ్రులు అరవిందుని భక్తులుగా పాండుచ్చేరిలో స్థిరబడి ఏభై ఏళ్లు దాటింది ; తండ్రి లేరు ; తల్లి యిప్పటికి నలభై ఏళ్లకు పైగా

యిక్కడే ఉంటున్నారు ; ఆమె వయస్సు యించుమించు గోపాలరెడ్డిగారి వయస్సు. రోజూ ఆశ్రమంనుంచే ఆమెకి కారియర్‌లో భోజనం వస్తుంది - చాలా సంవత్సరాల బట్టి; ఇలా నిత్యమూ ఆరువందల కారియర్లు వేరు వేరు ఇళ్లకు వెళ్తాయట ; ఈసారైతే ఆశ్రమంలో భోజనం చేయలేదుగాని క్రితంసారి వచ్చినప్పుడు వెళ్లాం : అత్యాధునికమైన హైజనిక్ కిచెన్ ; ప్రతిపూటా మూడు నాలుగువేల మంది భోంచేస్తారక్కడ.... కృష్ణమ్మగారింట్లో దయాకరరెడ్డి ఇద్దరు కోడళ్లనీ, రెండో కొడుకునీ చూశాం. పెద్దకోడలు ఆ రోజున అనుకోకుండా వచ్చింది నెల్లూరు నుంచి ; ఆమె, భర్త ప్రిన్స్‌టన్‌లో (అమెరికా) ఉంటున్నారు ; సోలార్ ఎనర్జీ శాఖలో పనిచేస్తున్నారు, పరిశోధన గావిస్తున్నారు. రెండో కోడలు అమెరికన్ వనిత – వారు పాండుచ్చేరిలోనే మరొకచోట ఉంటున్నారు ; అబ్బాయి బిజినెస్‌లో ఉన్నాడు ; కోడలు ఆశ్రమ సంబంధమగు ఒకానొక శాఖలో పని చేస్తోంది. పేరుకి 'టీ' గాని ఆరు పదార్థాలు చేశారు. ముఖ్యంగా అమెరికన్ వనిత తయారుచేసిన బెంగాలీఖీర్ ఎంతో రుచిగా ఉందనీ, తామింతవరకు అటువంటిది టేస్టుచేయలేదనీ అన్నారు చాలా మంది. రిటైర్డ్ మెడికల్ ఆఫీసరు, వినోబాజీశిష్యుడు, నలభైఏళ్లగా అక్కడ ఉంటున్న 62 ఏళ్ల యువకుడు- యిలా ఎందరినో కలుసుకున్నాం. ముఖ్యంగా దయాకర రెడ్డి తల్లి కృష్ణమ్మ గారి ముఖంలోని ప్రశాంతత, ఆ నేత్ర ద్వయంలోని వాత్సల్యము, కరుణాంతరంగంతో కూడిన ఆమె మృదు వచనమూ మరుపురానివి. ఆమెకి ఎనభై ఏళ్లంటే నమ్మలేరు - అంత ఆరోగ్యవంతంగా, విశ్వాసపూరితంగా, మానసిక తృప్తితో భాసిస్తున్నారామె.

.... ఆరు గంటలకు 'సీ-సైడ్ గెస్ట్ హవుజ్'లో శ్రీ నికేతన్‌వారు ఏర్పరిచిన యిష్టాగోష్ఠి. దయాకర్, ఇంద్రసేన్ దగ్గిరుండి తీసుకువెళ్లారు. ప్రతిపక్ష నాయకుడు రామచంద్రన్ (డి యమ్ కె), పాండుచ్చేరి కామర్స్ అధ్యక్షులు గోవిందస్వామి, ఛీఫ్‌జడ్జి రామలింగం మున్నగువారు 'గెట్ టుగెదర్'లో పాల్గొన్నారు. పాండుచ్చేరిలో (యూనియన్ టెరిటరీ) ప్రాంతీయ ప్రభుత్వం కాంగ్రెస్‌ది ; పదిహేనుగురు కాంగ్రెస్ సభ్యులు, అయిదుగురు ఎ ఐ డి యమ్ కె, నలుగురు డీ యమ్ కె ఉన్నారట. 'కేంద్ర పాలిత ప్రాంతంలోని ప్రభుత్వం ఏ పార్టీదైనా, సర్వాధికారాలూ లెఫ్ట్‌నెంట్ గవర్నరుకి ఉంటాయి. రాష్ట్ర ప్రభుత్వంలోని ముఖ్యమంత్రికి ఉండే అధికారాలు యిక్కడ ఉండవు. కడపటి నిర్ణయం గవర్నరుదే' - అన్నారు రామచంద్రన్. 'పద్దెనిమిది వందల ముప్ఫయిల్లో యిక్కడి ఛాంబర్ ఆఫ్ కామర్స్ స్థాపితమయింది. మా పూర్వీకులు నూట ఏభైఏళ్ల క్రితం యిక్కడ కొచ్చి స్థిరబడ్డారు. ఇప్పటికీ అయిదారు వేల మంది ఫ్రెంచి పౌరులు - అనగా ఫ్రెంచి సిటిజెన్‌షిప్ గలవారు -

ఉన్నారు' - అని చెప్పారు గోవింద స్వామి. 'మీరు ఫ్రెంచిలో లా చదువుకున్నారు కదా, ఇండియన్ పీనల్ కోడ్ (ఇంగ్లీషులో) ప్రకారం మీరు తీర్పు చెప్పాలాయె - ప్రారం భంలో యిబ్బంది కలగలేదా?'- అని నేనడిగిన ప్రశ్నకు, 'ఇంగ్లీషులో మన శాసనాలన్నీ పునఃపఠన గావించాను. అది ఒకవిధంగా నా దృక్పథాన్ని విస్తృత పరిచింది' - అన్నారు రామ లింగం. 'హిందూ లా యిక్కడ ఏ విధంగా అమలుపరుస్తాడు?' - అన్న నా సందేహానికి, 'కస్టమరీ హిందూ 'లా'కి ప్రాముఖ్య మిస్తాము' - అన్నారు న్యాయమూర్తి. పై ముగ్గురు వ్యక్తులతో పరస్పర సంభాషణలో దొర్లిన విషయాలివి - పది ముందూ చర్చించినవి కాదు. మరొక సంస్కృతిలో పుట్టి పెరిగిన ఈ ముగ్గురు తెలుగువారినీ కలుసుకోవడం, వారితో అనేక విషయాలు ప్రస్తావించడం -ఈ మహద్భాగ్యం గోపాలరెడ్డిగారి వల్ల వొనగూడింది.... సాయింత్రం అయిదు గంటలకు పాండుచ్చేరి యూనివర్సిటీకి వెళ్లవలసివుంది. కాని, వర్షపునీరు నిలిచి ఉండటం వల్ల అక్కడికి కారు వెళ్లే అవకాశంలేక, ఆ విజిట్ కాన్స లయింది. యూనివర్సిటీ పిఆర్ఒ లలితా నటరాజ్ పొద్దుటవచ్చి జ్ఞాపకం చేసి వెళ్లారు ; కాని, మధ్యాహ్నం కురిసిన కుంభవృష్టివల్ల అక్కడికి వెళ్లలేక పోయాముగాని లలితా నట రాజ్ వంటి విద్యా వినయ సంపన్నురాలి పరిచయం లభించింది. . రాత్రి ఎనిమిదిన్నరకి శాంతిహవుజ్‌లో- అంటేదయాకరరెడ్డి రెండవకూమారుని యింట్లో - డిన్నర్. వారికి యిద్దరు అబ్బాయిలు. ఆవిడ అమెరికన్ వనిత అని యిందాక చెప్పాను కదా- ఎన్నో వంటకాలు చేశారామె – కాని, ఏం తినగలం ? కొంచెం కొంచెమైనా రుచి చూడకపోతే బావుండదు. భోజనాలై, కబుర్లు ముగించి, రాజ్ నివాస్ చేరు కొనేసరికి పది అయింది.

## 05

రాత్రంతా ధారాపాతంగా వర్షం కురుస్తూనే ఉంది. ఆరుగంటలకి కాఫీ ట్రేతో బేరర్ తలుపు తట్టాడు. ఏడుం పావుకి కిందకి వచ్చాము. మొట్ట మొదట ఆశ్రమానికి, 1950 డిసెంబరు 5వ తేదీన శ్రీ అరవిందులు పాంచ భౌతిక శరీరాన్ని పరిత్యజించి నిర్వాణం చెందారు. ఇది ఒక పవిత్రదినం అరవిందాశ్రమానికి, అరవింద భక్తులకి. నిశ్శబ్దమే యిక్కడి ధ్యానస్రవంతి. శబ్దం చెప్పలేని సత్యం, సత్యదీప్తి ఆ మహాసమాధి సమక్షంలో అంకిత భావంతో ఆత్మార్పణ గావించుకొన్న ఎందరెందరికో లభిస్తోంది. వినమ్రతతో ప్రణమిల్లే వేలాది హృదయాల లోని నిర్నిద్రగానం విశ్వగాన విపంచి లోని ఒక పల్లవి - శబ్దరహిత మధుకీల.... అగరువత్తులు వెలిగించాం, పువ్వులు సమర్పించాం, మేడ మీద నున్న ఆయన మందిరం దర్శించి, అరవిందుని దీవెనగల కార్డు ఆనందంతో పుచ్చుకున్నాం. ఏడెనిమిది నిముషాల

పాటు ఈ లౌకిక జగత్తుకి భిన్నమైన వేరొక ప్రపంచాన్ని వీక్షించగలిగామనే అనుభూతి కలిగింది. అక్కడ నుంచి తిన్నగా 'గజానావె గార్డెన్' లోని సత్యకర్మ సమాధి వద్దకు వెళ్లాము. (సత్యకర్మ అనగా దయాకర రెడ్డి తండ్రిగారికి అరవిందులు పెట్టిన పేరది). గోపాలరెడ్డి గారికి ఆయన బాగా తెలుసు - ఒక ఊరువారు, బంధువులు. మహాసమాధి దర్శనం ఎంత ముఖ్యమో, సత్యకర్మ సమాధి కూడా అంతే ముఖ్యం గోపాల రెడ్డి గారికి! సమాధికి పూలమాలవేశారు పుష్పగుచ్ఛం ఉంచారు. ఎన్ని స్మృతులు ఆయన చుట్టూ ఝుంకారం చేసివుంటాయో!.... స్పెషల్ ఆఫీసరు రామారావు యింట్లో బ్రేక్‌ఫాస్ట్, రాము తలిదండ్రులది (శాంత - ప్రసాదరావు) మా పక్క కాంపవుండ్, రాము అమ్మమ్మ హనుమాయమ్మగారు మాకు బాగా తెలిసినవారు; కొన్నాళ్ల పాటు మా 'మానసా ప్రెస్' వారింట్లో ఉండేది; హనుమాయమ్మ అంటే సహకారోద్యమ (కోఆపరేటివ్ మువ్‌మెంట్) పితామహులైన వేమవరపు రామదాసుపంతులు కుమార్తె. ఇక, రామారావు భార్య మీనా, యమ్మెస్కో బుక్స్ యమ్మెన్‌రావు కుమార్తె. ఆ విధంగా భార్యా భర్త లిరువురూ చిన్నప్పట్నుంచీ తెలిసినవారు. 'మేము కొత్తగా యిల్లు కట్టుకున్నాం - మీరొకసారి రావాలి' అని మీనా మద్రాసు వచ్చినప్పుడల్లా అంటూ ఉండేది. శ్రీనికేతన్ వారి ప్రోగ్రామ్ ప్రకారం ఈ ఉదయం వారింట్లో మాకు బ్రేక్‌ఫాస్ట్ - రెండూ కలిసొచ్చాయి ఇడ్లీ, వడ, పొంగల్, రవ్వకేసరి, రసగుల్లా, యాపిల్స్‌తో ఉదయాహారం. అభిమానం కొద్దీ అన్ని తయారు చేస్తారుగాని తినగలమా? రామారావుతో గోపాలరెడ్డిగారు పాండుచ్చేరి విశేషాలు ముచ్చటించారు. డాక్టర్ జోసఫ్ దంపతులు అక్కడ పరిచయమయారు; ఆయన డాక్టరైతే, ఆమె టీచర్, నిన్న మధ్యాహ్నం నుంచీ ఇంద్రసేన్ ఫొటోలు తీస్తూనే వున్నారు - రెండేసి నిముషాలు కొకసారి కెమెరా క్లిక్‌మంటోంది.... పదిన్నరకి పాండుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నరు త్రిభువన ప్రసాద్ తివారీతో యింటర్వ్యూ, ఫోటోలు. గోపాలరెడ్డి గారితో వెళ్లడం వల్ల సమకూడిన మహదవకాశమది. నిన్న ఉదయం మేము మా రూమ్సులోకి వెళ్లగానే, మూడేసి పుస్తకాలు గల పాకెట్ ఒకటి బేరర్ తీసుకొచ్చి యిచ్చాడు - ముగ్గురికి మూడు పాకెట్లు అవర్ హెరిటేజ్ (మన వారసత్వం - Our Heritage) కన్సర్వేషన్ అండ్ ప్రోగ్రెస్ (పొదుపు - ప్రగతి.... Conservation and Progress) వాల్యూస్ అండ్ గ్రోత్ (విలువలు-పెరుగుదల.... Values and Growth పుస్తకం చూడగానే అందులోని సారమెంతో గంభీరవంతమైనదని అనిపించిందే తప్ప, పట్టున పది పేజీలు చదివే వ్యవధి లేకపోయింది. అయితే మాలతి మాత్రం అక్కడక్కడ తిరగేసినట్లుంది. అంచేత, గవర్నరుగారితో ఒకటి రెండు విషయాలు ప్రస్తావించ గలిగింది. గోపాల

రెడ్డిగారితో బాటు మా ముగ్గురికీ గిఫ్ట్ పాకింగ్‌లో జ్ఞాపికలు ఇచ్చారు గవర్నరు తివారీ (నాకు సరస్వతీ దేవి విగ్రహం-సీతాదేవికి, మాలతికి లక్ష్మీ విగ్రహాలు). ఆయన మధ్యాహ్నం ఒంటి గంటకు మద్రాసు వెళ్తున్నారు - యల్వి ఆర్ ఛారిటిస్ బహుమతి ప్రదానోత్సవ సభకు అధ్యక్షులు-మీటింగు అయిపోగానే రాత్రికి రాత్రే తిరిగి వస్తారట. శ్రీమతి తివారీ వ్రాసిన హిందీ కవితా సంకలన మొకటి సీతాదేవికిచ్చారు. మాజీ గవర్నరూ పాండుచ్చేరి గవర్నరూ యుపి సంగతులు, సరోజినీ నాయుడు కాలం నుంచీ యుపి ప్రజలకు ఆంధ్రా గవర్నరులు సన్నిహితులవడం యిత్యాది విశేషాలు మాట్లాడుకుంటూ వుండగా, మేము అవి వింటూ, టీ బిస్కట్లూ తీసుకున్నాం. భారతీయ సంస్కృతికి సజీవ దర్పణంలా కనిపించిన త్రిభువన్ ప్రసాద్ తివారీ వద్ద సెలవు తీసుకు, మేము బయటకు రాగానే, లేడీసిద్దరూ విద్యా తివారిని చూసేందుకు, లిఫ్టులో పైకి వెళ్లారు. ముప్పావుగంట ఆమెతో గడిపి వచ్చిన వాసిరెడ్డి సీతాదేవి, మాలతీ చందూర్ ఆమె హృదయ సౌరభానికీ, కవితాస్పందనకు జోహారులర్పించారు.... పన్నెండున్నరకి లంచ్ రెండున్నరదాకా రెస్ట్, మూడు గంటలకు, ఆరొవిల్లి వెళ్లేటప్పుడు రామకృష్ణ యింట్లో టీ.... దయాకరరెడ్డి, ఇంద్రసేన్ మరొక కారులో మాకు దారి చూపగా, రామకృష్ణారెడ్డి ఇంటికి వెళ్లాం. నిన్న సాయింత్రం ఆయన్ని శ్రీనికేతన్ సమావేశంలో కలుసుకున్నాం. కేకులూ, సోమాస్, జీడీ పప్పులు, వేడి వేడి బోండాలూ –ఒంటి గంటకు భోంచేశాము - అయినప్పటికీ కాస్త కాస్త రుచిచూడక తప్పదు.... బయలుదేరబోతున్నప్పుడు గోపాల రెడ్డిగారికి ఒక గిఫ్టూ, అరు పాకెట్స్ అగరొత్తులు గల గిఫ్ట్ పాకింగ్ నాకూ ఇచ్చారు. మధ్యాహ్నమనుకున్నాం పాండుచ్చేరి వచ్చి అగరొత్తులు తీసుకెళ్లకుండా వెళ్లడమేమిటని? ఎడతెరిపి లేని వర్షమవడం వల్ల, మధ్యాహ్నం జవహర్ బాల భవన్‌కి వెళ్లినప్పుడు కూడా వీలవలేదు. ఆ లోటు తీర్చిన రామకృష్ణ. అగరొత్తులతో ఈ విజిట్ జ్ఞాపకం పెట్టుకొనేటట్టు చేశారు.... ఆరొవిల్లి ఒక మహాస్వప్నం 124 దేశాల మట్టితో ఇక్కడ స్థాపించిన అంతర్జాతీయ ప్రయోగాత్మక పథకం గురించి, ప్రారంభోత్సవంలో పాల్గొని వచ్చిన డా॥ సి డి దేశ్‌ముఖ్ సుమారు ఇరవై ఏళ్లక్రితం, ఆంధ్ర మహిళాసభ టూరిస్ట్ హాస్టల్ మేడమీద మాకు చెబుతూంటే (మా ఇద్దరితో బాటు ఒకరిద్దరున్నారేమో - అంతే) ఎంతో శ్రద్ధగా చెవులు దోరబెట్టుకు విన్నాం. దేశ దేశాల మైత్రీ పర్వానికి, ఈ భారత భూమిలో, శ్రీ అరవిందాశ్రమ సామీప్యంలో అంకురార్పణ జరిగిందనుకున్నాం. ఆరంభంలో ఉన్న ఉత్సాహం అనేకానేక కలతల వల్ల కొంచెం పల్చబడింది. కట్టడాలు లేస్తున్నాయి, పనులు జరుగుతున్నాయి. కాని, ఆశించినంత వేగంగా కాదు . . .

ఇంద్రసేన్ ఎంతో ఉత్సాహవంతంగా చెప్పారు అరొవిల్లి కట్టడాలలోని ధర్మ సూక్ష్మాలు. అయితే, అది 20 వ శతాబ్దంలో పూర్తయే సూచనలు కనిపించడం లేదు. 21వ శతాబ్దపు ప్రాజెక్ట్ అది.... మెయిన్ రోడ్ మీదకి తీసుకొచ్చాక, దయాకర్ రామకృష్ణ, ఇంద్రసేన్‌ల కారు పాండుచ్చేరి వైపుగా వెనక్కి మళ్లింది - కాసెట్ మ్యూజిక్‌తో డ్రయివరు మాధవన్ మమ్మల్ని మద్రాసు తీసుకొచ్చాడు. మూడున్నర గంటలలో, నిన్నపొద్దుట ఏడున్నరకి వర్షంలో బయలుదేరాం, ఇవ్వాళ రాత్రి ఎనిమిదింటికి వర్షంలో వచ్చాము.

. . . . . 06

కలకత్తాలోని ఆదర్స్ వర్క్‌షాపు వారు, డి అంజనేయులు వ్రాసిన 'గ్లిమ్సెస్ ఆఫ్ తెలుగు లిటరేచర్' **(Glimpses of Telugu Literature)** ప్రచురించిన సందర్భంగా, పామ్‌గ్రోవ్‌లో ఆ పుస్తకావిష్కరణ ఫంక్షన్. అదే సందర్భంగా 'నిర్మాణ్' (Nirman) అనే సాహితీ సంస్థను ప్రారంభించారు ప్రముఖ జర్నలిస్ట్ వుప్పులూరి కాళిదాసు. 'నిర్మాణ్' డిసెంబరు ఆఖరు వారంలో భారత రాష్ట్రపతి వెంకట్రామన్ అభినందన సంచిక వెలువరించనున్నది. ఆహూతులకు కాళిదాస్ స్వాగతం తెలిపిన మీదట, 'సబ్‌స్టూట్ ప్రెసిడెంట్'గా వ్యవహరించడం చాలా కాలంగా తన విషయంలో అనువాయితీ అయింది దన్నారు హాస్యోక్తులతో సభ నిర్వహించిన చిత్రా నారాయణస్వామి, అకుంఠిత ఆశావాదిఅయిన కాళిదాసులో ఆశ్చర్యవంతమగు అప్యాయత ఉన్నదన్నారు శ్రీనివాసయ్యంగార్. గ్రంథ రచయిత అంజనేయులులోని నిశిత పరిశీలనాశక్తిని తమిళనాడు ఛీఫ్ సెక్రటరీ పద్మనాభన్ మెచ్చుకోగా, పురాణేతిహాసాల తర్వాత పొయిట్రీదే ప్రముఖస్థానమన్నారు నాగరాజారావు. మ్యూజిక్ అకాడమీ టి టి వాసు, అంజనేయులకి, నిర్మాణ్‌కీ శుభాకాంక్షలు తెలిపారు. సంస్కృత కాలేజి ప్రిన్సిపాల్ జానకి, తెలుగు సాహిత్య సంపదను, తెలుగు తెలియని వారికి పరిచయంచేసే చక్కటి గ్రంథమిది - అన్నారు. అంజనేయులు సముచితరీతిని సమాధానం చెప్పారు. (Climpses of Telugu Literature) పుస్తకం వెల రు 125=00.

. . . . . 08

పారిశ్రామికవేత్త, దాన దయాశీలురు, వేదసంస్కృతి పట్ల అభిమాన మూగలబివియస్సెస్ మణిగారికుమార్తె సౌ॥ మాధవికి, ఇంగువ కృష్ణమూర్తి దంపతుల కుమారుడు చి॥ శివరామ శాస్త్రికీ, తిరుపతి శ్రీనివాస కళ్యాణ మండపంలో అయిదో తేదీ ఉదయం 10 గం॥ 18 ని॥లకు వివాహం జరిగింది. ఇవ్వాళ సాయింత్రం వుడ్ లాండ్స్‌లోని రిసెప్షన్‌కి బంధుమిత్రులు, అనేకరంగాలలోని ప్రముఖులూ వచ్చి నూతన దంపతులకు శుభాకాంక్షలు తెలిపారు.

.09

రాజాలక్ష్మి అవార్డ్ గ్రహీతకు, అమెరికా రానుపోను ఖర్చులూ అక్కడ పది హేను రోజుల పర్యటనకయే ఖర్చూ తమ స్వంత సంపాదన నుంచి వెచ్చిస్తున్న డాక్టరు దంపతులు జ్యోతీరావు, కెవి రావు, రమణయ్య రాజా షష్ట్యబ్ద సందర్భంగా, ఈ నవంబరు పంధొమ్మిది ఫంక్షన్‌లో పాల్గొనేందుకు ప్రత్యేకంగా అమెరికా నుంచి వచ్చారు. విదేశ పర్యాటకుల కిచ్చే ఇండ్ రైల్ పాస్‌తో అటు అజంతా ఎల్లోరాలు, యిటు కన్యాకుమారి మున్నగునవి పర్యటించి, ఈ రాత్రి అమెరికా వెళ్లిపోతున్నారు; సాయింత్రం కాస్మోపాలిటన్ క్లబ్బులో రమణయ్య రాజా (కళారంజని, కూచిపూడి ఆర్ట్ అకాడమీ, ఫ్రెండ్స్ సర్కిల్, రచన ఈ నాలుగూ సంయుక్తంగా) డాక్టరు మిత్రుల గౌరవార్థం టీ ఏర్పాటు చేశారు. హోరున వర్షం పడుతున్నా అనుకున్న వారందరూ వచ్చారు. కెవి రావు జ్యోతీరావుల గురించి నాలుగు మాటలు చెప్పారు పప్పు వేణుగోపాల రావు; ఇందరు తెలుగు మిత్రులని కలుసుకోవడం తన కెంతో సంతోషంగా ఉన్నదన్నారు డా॥ కెవి రావు.

. . . . . 13

ప్రఖ్యాత ఫిలిమ్ నిర్మాత సురేష్ సంస్థ అధినేత అయిన రామానాయుని కుమారుడు యువహీరో వి॥ వెంకటేష్‌కీ, వెంకటసుబ్బారెడ్డిగారి కుమార్తె సౌ॥ నీరజకు, రాత్రి 7 గం॥ 24 ని॥లకు మిధున లగ్నంలో వివాహ మహోత్సవం విజయా శేష్‌మహల్‌లో జరిగింది. 'విజయా'లో వివాహమంటే ఆ పద్ధతీ. అతిథి మర్యాద వేరు. మద్రాసులోని సినీ పరిశ్రమే కాదు, హైదరాబాదులోది కూడా అక్కడే ఉంది. నూతన వధూవరులకు మా శుభాకాంక్షలు.

. . . . . 14

సాధారణంగా యిద్దరికీ యిన్విటేషన్ పంపే ఐసిసిఆర్ (Indian Council for Cultural Relations) ఈసారి ఒక్కరికే పంపి, స్థలా భావం పంపలేక పోతున్నామని కబురంపారు. పోస్టులో అయితే ఎవరైనా కొట్టేస్తారేమోనని స్వయంగా మెస్సెంజర్ తీసుకొచ్చి యిస్తాడు. టికెట్లు కొందామన్నా దొరకవు - పదిరోజుల క్రితమే అన్నీ ఖర్చయిపోయాయి. నిన్నా యివ్వాళ మ్యూజిక్ అకాడమీలో సోవియట్ ఉత్సవంలోని జానపద నృత్యాలు. నిన్న గవర్నరు ఖురానా ముఖ్య అతిథి; ఇవ్వాళ తమిళనాడు ముఖ్యమంత్రి యమ్ జి ఆర్ ముఖ్యఅతిథి నాది 'బి' వరసలో ఏడో నెంబరు సీటు - పావుగంట ముందుగా సీట్లు కూచోమన్నారని సరిగ్గా ఆ టైముకి వెళ్లాను. అయితే, అరగంట ముందుగా వచ్చి కూచున్నవారున్నారు. కింద హాలు సగంపైగా నిండింది అప్పటికే. ఐగోర్ మొయిసీఫ్ (Igor Moiseev). దర్శకత్వంలో జానపద నృత్య చయనిక. ఆ

యువతీ యువకుల స్టెప్స్‌లోని సొంపూ సొగసూ, వారి శరీర సౌష్టవమూ పద విన్యాసమూ, లయ బద్ధమైన వారి సామూహిక నృత్య ప్రదర్శన, యువతీ యువకుల సహజ కవ్వింపు చర్యలూ, తమాషా చేస్తున్నట్లుగా అతిక్లిష్టమైన ఫీట్స్ చూపడం, సల్లాపశృంగారమూ, జానపద నాట్యహొయలూ, వినోద విలాసాల మేళవింపూ, సుమారు రెండు గంటల సేపు వారు మనని తమ కళా మయలోకాన పర్యటింప జేస్తారు. రబ్బరు బంతుల్లా గెంతే ఆ యువతీ యువకులలోని సుశిక్షణ, తమ విద్య పట్ల వారికి గల అంకిత భావం ప్రశంస నీయం. ఈ సోవియట్ ఫెస్టివల్ మన రెండు దేశాలనీ సాంస్కృతికంగా మరింత సన్నిహిత పరుస్తుంది.

. . . . . 15

'విజ్‌డమ్' ఈ తేదీన పదిహే నేళ్లగా పండగ చేసుకుంటోంది. యావ ద్భారతావనిలోను, యితర దేశాలలోను 'విజ్‌డమ్' (Wisdom) ఆంగ్ల మాస పత్రికకు వున్న ఆదరణ, సాధారణ పత్రికా పాఠకులకి అర్థం కాదు - మీ అబ్బాయి నడగండి చెబుతాడు - అం దులో ఎన్ని మంచి విషయాలూ తెలుసుకోవలసిన విషయాలూ వుం టాయో! ఎదుగుతున్న మనసుకే కాదు, మీకూ నాకూ కూడా ప్రతినెలా ఎన్నో కొత్త సంగతులు చెబుతుంది 'విజ్‌డమ్'. రాజకీయాలనీ సినిమాలనీ దరిదాపు లకి రానివ్వని ఈ పత్రిక పదిహేనవ వార్షికోత్సవానికి జస్టిస్ రత్నవేలు పాండియన్ అధ్యక్షులు; జస్టిస్ సేతు రామన్ ఆంగ్ల వార్షిక సంచికను, న్యూరో సర్జన్ రామ్మూర్తి తెలుగు వార్షిక సంచికను విడుదల చేశారు. ఇంగ్లీషు మీడియమ్‌లో చదువుకున్న విద్యార్థి ఐక్య అధికంగా ఉంటోం దన్న వాస్తవాన్ని సంకుచిత భాషా వాదులు విస్మరింపరాని విషయమని హెచ్చరించారు రామ్మూర్తి. స్వాతం త్ర్యం వచ్చి, యిది నలభై ఒకటో సం వత్సరం గనక నలభై ఒక్కరికి ఈ సంవత్సరం విజ్‌డమ్ అవార్డులు అంద జేసినట్టున్నారు - అని చమత్కరిం చారు మద్రాసు దూరదర్శిని డైరక్టర్ అకిలా శివరామన్. సంపాదకులు. గోవిందరావు స్వాగతం తెలుపగా, ఆంధ్రా ఛాంబర్ ఆఫ్ కామర్స్ అధ్య క్షులు పి యస్ భాష్యం అభినందనలు తెలిపారు. అవార్డ్ గ్రహీతలలో లయన్ గోవర్ధనరావు, లయొనెస్ సుశీలారావు, సోషల్‌వర్కర్ జార్జి, డాక్టర్ గోపాలన్ రంగస్థల కళాకారులు, ఎక్కువ మార్కులు తెచ్చుకున్న విద్యార్థినీ విద్యార్థులు, వికలాంగులు, ఉత్తమ బస్ కండక్టర్, ఉత్తర బస్ డ్రయివర్, ఉత్తమ టాఫిక్ కానిస్టేబుల్ - యిలా నలభై ఒక్కమందికి ఆయాశాఖలలో గుర్తింపుగా ఈ విజ్‌డమ్ బహు మతులు అందజేశారు. మొత్తం కార్య క్రమం ఎనభై నిముషాలలో ముగిసింది, టైము ఎంత విలువైనదో గుర్తింపు గా!

. . . . . 17

'తనరచనలపై యితరులు డాక్టరేట్ చేయవలసిన అంతస్థుకొచ్చిన నా పార్ధ సారథి (కేంద్ర సాహిత్య అకాడమీ కార్యవర్గ సభ్యులు), తను డాక్టరేట్ పొందాలని రెండున్నరేళ్లగా ఎంతో శ్రమపడి ఆరోగ్యాన్ని అలక్ష్యం చేశారు'— అన్నారు కెయస్ శ్రీనివాస య్యంగార్, కేంద్రసాహిత్య అకాడమీ ప్రాంతీయ కార్యాలయంలో 'నా.పా.' అకాల మరణానికి విచార సూచకంగా ఏర్పరచిన సంతాప సభలో! కార్యదర్శి కృష్ణమూర్తి 'నాపా' కు నివాళు లర్పించారు. స్నేహితుడూ సచ్చిం తనుడూ అయిన నాపా, అకస్మాత్తుగా తెరమరుగవుతాడని అనుకోలేదన్నారు డి ఆంజనేయులు. '1973 సాహిత్య అకాడమీ అవార్డ్ పొందిన 'సము దాయ వీధి' (తమిళనవల) తెలుగు చేశాను - ప్రింటవుతోంది - సగంలో ఉంది. అది చూడకుండానే వెళ్లి పోయారు అజాత శత్రువైన పార్ధ సారధి' – అన్నారు మాలతీచందూర్. 'మొదట్నుంచీ ఆయన కష్టజీవి ; ఒకొక్క మెట్టే కష్టపడి ఎక్కారు. ఏనాడో ఎమ్.ఎ. పూర్తిచేసిన 'నాపా'కు డాక్టరేట్ మీద వల్లమాలిన అభిమానం. ఆయన థీసీస్ ఆస్ట్రేలియాలో ఒకరు, జపాన్‌లో ఒకరు, బెనారస్‌లో ఒకరు పరిశీలించారు. కౌలాలంపూర్‌నుంచి (ప్రపంచ తమిళ సభలు) తిరిగొచ్చాక, అనారోగ్యంతో నర్సింగ్ హోమ్‌లో వున్నప్పుడు, డాక్టరేట్ పొందిన సంగతి స్వయంగా విన్నారు' - అని చెప్పారు ఆయన చిరకాల మిత్రు లొకరు. ఏభై అయిదేళ్లకే 'దీపం' (ఆయన నిర్వహించే పత్రిక పేరు) పార్ధసారధి, పరంజ్యోతిలో అయిక్య మవడం, తమిళ సాహిత్యానికి తీరని నష్టం. 'నాపా' వంటి భావుకులూ విస్తృత పరిధి గలవారూ, ఉత్తమ సాహితీపరులు ఆనాటికానాడు అరు దవుతున్నారు.

. . . . . 20

"శ్రీనివాసశాస్త్రి హాలులో కన్యా కుమారి 'వాద్య లహరి' (Vaadya Lahari) గ్రామఫోన్ కంపెనీ కాసెట్‌ని, యమ్మెల్ వసంతకుమారి రిలీజ్ చేశారు. ఈ 'వాద్యలహరి'లో కన్యాకుమారి వయొలిన్‌తో బాటు పాల్గొన్నవారు : యమ్మెకె శివా, విజయలక్ష్మి, రాజా రావు, వాసన్.... 'కన్యాకుమారి నా కూతురు లాటిది. మద్రాసు యూని వర్సిటీలో వయొలిన్‌లో సీనియర్ స్టూడెంట్ గోల్డ్ మెడల్ తీసుకుంది. వేదిక మీద నిశ్శబ్దంగా కూచుంటుంది గాని వుత్తప్పుడు తెగ కబుర్లు చెబు తుంది — మొదలుపెట్టిందా, ఆప లేము. తన సంగీత సాధనలో సర్వం మర్చిపోయే స్వభావ మామెది. నేపాల్ రాజదంపతుల ముందు ప్రత్యేకంగా వాయించి వారి మెప్పు పొందింది. దేశ దేశాలూ నాతో తిరగడమే గాక స్వంతం గా ఎన్నో కచ్చేరీలు చేసింది' అన్నారు. వసంత కుమారి, మొదటి కాసెట్‌,

ప్రఖ్యాత సంగీత విమర్శకుడు సుబ్బుడి కిస్తూ! 'నా వయస్సు 72, కాని, సంగీతం వింటున్నప్పుడు 27 అవుతుంది. మానసికంగా నంటారూ, నేను 17 ఏళ్ల వాడిని. కాసెట్ ఫ్రీగా యిస్తామన్నారు - అందుకని ఆదరాబాదరా పరిగెత్తుకొచ్చాను .... చాలా మంది 'హంసధ్వని' పాడుతున్నప్పుడు, వాయిస్తున్నప్పుడు అది హి ం స ధ్వ ని లా ఉంటుంది. కాని, కన్యాకుమారి విషయంలో మాత్రం అది అక్షరాల 'హంస ధ్వనే' - అన్నారు సుబ్బుడు చతురోక్తులతో. టివిలో కనిపించే ఎందరెందరో సంగీత విద్వాంసులు ఫంక్షన్ కొచ్చారు. కన్యాకుమారికి మద్రాసు సంగీత ప్రపంచంలో యింత ప్రతిష్ట, పలుకుబడీ వున్నాయా అని ఆశ్చర్యమేసింది"- అంది మాలతి, - కన్యాకుమారి కాసెట్ రిలీజ్ ఫంక్షన్ ఎలా జరిగిందని అడిగినప్పుడు.... దేవీ థియేటర్‌లో పిక్చర్ వుండటం వల్ల నేను వెళ్లలేక పోయాను.... 'ఈ పిక్చర్ ఒకసారి చూశానుకదా, మళ్లీ పిలిచారెందుకు?'- అని ప్రశ్నించాను ప్రెస్ వరసలో నన్ను కూచోబెట్టిన పెద్దమనిషిని (డిస్ట్రిబ్యూటర్). 'మీరు చూశారు - మీరు రాసిన రెవ్యూకూడా చదువుకున్నాం - బావుంది. ఈసారి స్టీరియో ఫోనిక్ సౌండ్‌తో 70 యమ్మెమ్‌లో చూసి, మళ్లీ రాస్తారని పిలిచాము' - అన్నారు ఆయన నవ్వుతూ .... 'జ గ తి -376' చిత్ర జగతిలో The Mission గురించిన సమీక్ష వెలువడింది. సుప్రగీత్‌లో చూసినప్పటికంటె యిక్కడ మరింత ఇంప్రెసివ్‌గా ఉంది. దక్షిణ అమెరికాలోని ఆదిమ తెగలను వేటాడి బానిసలుగా అమ్మే రోజులనాటి (1756) కథ యిది. క్రైస్తవ మత దీప్తి ఒక్కటే ఆనాటి మానవతా దీపం. అయితే, స్పెయిన్ పోర్చుగల్ దేశాలు తమ వలస ప్రాంతాలకు, సంబంధించిన సరిహద్దు వైరంలో కీకారణ్యాన నివశించే ఆదిమవాసులని ఎలా ఖతం చేసినదీ, మత సంరక్షణ కోసం ఫాదరీలు ఆహుతికాగా ప్రధాన మతాధిపతి ఏవిధంగా ఈ దారుణ మారణ కాండను, ఎలా అశక్తుడై ఆపలేక పోయినదీ ఈ యితివృత్తం వెల్లడిస్తుంది - అద్వితీయ ప్రకృతి సౌందర్యాల తోరణంతో! 'రాజరికానికీ, మతపీఠానికీ గల స్పర్ధలో, రాజరికం ఎంత నిర్దాక్షిణ్యంగా రక్తం చిందించేదీ హృదయ విదారకంగా చూపుతుంది ఈ క్లాసిక్' - అని వెనక రాసినదే పునరుద్ఘాటిస్తున్నాము .... పొట్టి శ్రీరాములు హాలులో అభ్యుదయ సాహిత్యం గురించి సెట్టి ఈశ్వరరావు మాట్లాడారు. ఆంధ్రాలో అభ్యుదయ వేదికకు అద్యులు తాపీధర్మారావు, సాహిత్యానికి రాజకీయ ప్రభావం అవసరమా ? నిజాయితీ లోపించిన రచయిత ఉత్తమ సాహిత్యం సృష్టించగలడా ?- యిలాటి విషయాలపై యిష్టాగోష్టి జరిగింది.

. . . . . 21

భారత ప్రధాని రాజీవ్ గాంధీని టివిలో చూడటం వేరు - దగ్గర్నుంచి ప్రత్యక్షంగా చూడటం వేరు. ఆంధ్ర

మహిళాసభ స్వర్ణోత్సవం 'కలైవణార్' లో ; మైలాపూరు అకాడమీ పంక్షన్ (భక్తవత్సలం చిత్రపటా విష్కరణ) రాజభవన్‌లో ! ఎక్కడైనా ముప్పావు గంట ముందుగా సీటులో ఉండాలి. మైలాపూర్ అకాడమీ డైతే ప్రెస్ వారికని కేటాయించిన సీట్లు 'శారద క్కని వాళ్ల ఫ్రెండు లక్ష్మితో ఆంధ్ర మహిళా ఫంక్షన్‌కి పంపి, మనం రాజ భవన్‌కి వెళ్దాం' - అంది మాలతి. నా మనసులో వున్నదీ అదే! వారిద్దరినీ కలైవణార్ వద్ద దింపి, రాజభవన్‌కి వెళ్లాం. రెండు ఫంక్షనుల కారు పాస్‌లు ముందే అతికించుకు బయలు దేరడం వల్ల ట్రాఫిక్‌వారు కారుని వెళ్లనిచ్చారు - లేకపోతే, సాధ్యం కాదు .... ఎనిమిది గంటలకు రాజీవ్‌గాంధీ వస్తారు రాజభవన్‌కు ; ఆహ్వాన పత్రం చేతిలో పుచ్చుకు, మెటల్ డిటెక్టర్స్ ద్వారా పాస్ అయి, ఏడుం పావుకి సీట్లో ఉండాలి. ఏడూ పదికే మేము వెళ్లాం - కాని, అప్పటికే షామి యానా అంత నిండిపోయింది. మాది పత్రికా వర్గం గనక మా సీట్లకు యి బ్బంది లేకపోయింది. షామియానాలో పెట్టారు, వర్షంగాని పడుతుందేమో నని లోన దుడుకుగా ఉన్నా, వర్షం పడకూడదని అందరూ కోరుకున్నారు. అయితే, వానదేవుడు కాసేపు ఆడించి చూదామనుకున్నాడు కాబోలు, తడిసే పాటి చినుకు పడిందిగాని భారీవర్షం కురవలేదు. రాజీవ్ గాంధీ వచ్చేవేళకి వానజల్లు ఆగిపోయింది.... యమ్మెల్ వసంతకుమారి ప్రార్థనానంతరం, మైలాపూర్ అకాడమీ అధ్యక్షులు యస్వి నరసింహన్ భారత ప్రధానికి స్వాగతం తెలిపారు. కార్యదర్శి వీర రాఘవన్, ఈ పంక్షన్ సందర్భంగా వచ్చిన సందేశాలు చదివి వినిపించారు. గవర్నరు ఖురానా 'భక్తవత్సలం సావనీర్' విడుదల చేశారు. త్రివేణి అకాడమీవారు 'భక్తవత్సలం తైల వర్ణ చిత్రాన్ని' కుమార్తె సరోజినీ వరదప్పన్‌కి అందజేయగా, ఆమె మైలాపూర్ అకాడమీకి సమర్పించారు. 'గాంధీగారి సిద్ధాంతాలకి కట్టుబడి నడుచుకొన్న స్వాతంత్ర్య యోధుడు భక్తవత్సలం, ఆ తరం మహనీయుల వద్ద నుంచి నేటి యువతీయువకులు నేర్చుకోవలసినదెంతైనా ఉంది' -- అన్నారు రాజీవ్‌గాంధీ, - చిత్రపటా విష్కరణ గావిస్తూ! ఇవ్వాళ అందరితో బాటు వరుణునికి కూడ వందన సమర్పణ చెప్పవలసి వుంది అన్నారు యన్పి రాఘవాచారి. ముప్పయి నిమి షాల్లో ముగిసినది ఈ కలర్‌ఫుల్ ఫంక్షన్‌కి మద్రాసు నగరంలోని ప్రముఖులందరూ వచ్చారు. ........ కారెక్కబోతూవుండగా లిఫ్ట్ కోరారు యిద్దరు పత్రికా మిత్రులు, ఒకరిని థవుజెండ్ లైట్స్ వద్దా, మరొకరిని 'హిందూ' ఆఫీసు వద్ద (ఫోటోగ్రాఫర్ శ్రీధర్) దింపి, యిల్లు చేరుకొనేసరికి తొమ్మిదిన్నర. (ముత్తురంగ మొదలి యార్ ఒకనాటి కాంగ్రెస్ నాయకుడు ; ఆ కుటుంబములోని వారు భక్త వత్సలం; ఈయన మామగారు గోపాల స్వామి మొదలియార్ కూడా కాంగ్రెస్

నాయకుడే! వివి గిరి, కామరాజ్‌ల సమ కాలికులు భక్తవత్సలం. సమాజ సేవా కార్యక్రమాలలో కుమార్తె సరోజినీవర దప్పన్ సుప్రసిద్ధురాలు. మనుమరాలు జయంతీ నటరాజన్ పార్లమెంట్ సభ్యురాలు)

## 22

స్రవంతీ ఆఫీసులో బ్రేక్‌ఫాస్ట్ పార్టీ. రవి కిషోర్ సమర్పిస్తున్న 'మహర్షి' చిత్ర విశేషాలు తెలిపారు వేమూరి సత్యనారాయణ. 'రాక్షస సంహారం' దర్శకుడు రాఘవ యిందులో హీరో మహర్షి. పన్నెండు చిత్రాలలో గబగబా బుక్ అయిన నిశాంత (భానుప్రియ సోదరి)యిందులో హీరోయిన్ సుచిత్ర. అందరూ కొత్తవారు. ఇళయరాజా సంగీతం, వంశీ దర్శకత్వం, తనికెళ్ల భరణి మాటలు. కె శారదాదేవి నిర్మిస్తున్న ఈ చిత్రం డిసెంబరు నెలాఖరున విడుదల అవుతోంది.... కాలేజీ రోడ్‌లోని మద్రాసు లిటరరీ సొసైటీ (Madras Literary Society,) అంటే ఎన్నో ఎన్నెన్నో జ్ఞాపకాలు. ఏభైలలో ఉదయం తొమ్మిదిన్నరకి అక్కడికి వెళ్లి, సాయింత్రం నాలుగూ అయిదు దాకా అన్నం నీళ్లూ మర్చిపోయి ఆ పుస్తకాల మధ్య గడిపిన రోజులున్నాయి. అప్పట్నుంచి యిప్పటిదాకా బ్రేక్ లేకుండా సభ్యత్వపట్టికలో వున్న నలభైఏభై మందిలో నేనూ ఉన్నాను. 45 లక్షల జనాభాలో నలభై ఏభై మంది మాత్రమే అవిచ్ఛిన్నంగా ముప్ఫయ్యయిదేళ్ల , భ్యత్వం గల మెంబర్లు. మొత్తం సభ్యులు నూటపది -అని విన్నాను. ఇవ్వాళ ప్రత్యేక సర్వ సభ్య సమావేశం. 175 ఏళ్ల వయసు గల ఈ పుస్తకాలయంలోని కొన్ని ప్రాచీన గ్రంధాలు, చేయితాకితే పొడి అయిపోయే పరిస్థితిలో ఉన్నాయి . గత నాలుగైదేళ్లుగా రమేష్‌రావు గౌరవ కార్యదర్శిగా బండి లాక్కొస్తున్నారు. స్వభాషావాదం వెర్రితలలు వేస్తున్న ఈ రోజులలో ఇంగ్లీషు పుస్తకాలుగల ఈ గ్రంధాలయం మీద ఎవరికి ఆసక్తి వుంటుంది? అంతకీ తమిళనాడు ప్రభుత్వం ఎన్నో సదుపాయాలు కల్పిస్తోంది .... ఇందిరాగాంధీ సెంటర్ ఫర్ ఆర్ట్స్‌వారు (Indira Gandhi Centre for National Arts) ఈ పుస్తకాలయంలోని 20 వేల పాత పుస్తకాలు శిధిలం గాకుండా ఆధునిక పద్ధతులలో లామినేషన్ యిత్యాదులతో బాగుచేసి పరిశోధకుల సౌకర్యార్ధం మైక్రోఫిల్ కాపీ ఒకటి ఈ సొసైటీకి అందజేసి, శిధిలావస్థలో ఉన్న ఇరవైవేల పుస్తకాలు, ఢిల్లీ సెంటరులో భద్రపరుస్తా మన్నారు. ముగ్గురు సభ్యులు గల ఒక కమిటీ వచ్చి, యిందులో భద్రపరచదగు పుస్తకాలెన్ని వున్నాయో పరిశీలించింది. ఇందిరాగాంధీ సెంటర్ కార్యదర్శి కపిలా వాత్సాయన్ ప్రత్యేక శ్రద్ధ తీసుకోవడం వల్ల ఈపాటి కదలికైనా ఏర్పడింది. దీనికంతా అయే ఖర్చు నలభై లక్షలు. ఆ ఖర్చుంతా తాము భరించి, మద్రాసు లిటరరీ సొసైటీ ఆర్థిక సౌష్టవానికి అనుకూలంగా

ఉండేటట్టు 15 లక్షలకు తక్కువ గాకుండా 20 లక్షలకు మించకుండా, ఈ పుస్తకాల మార్పిడికి ప్రతిఫలంగా యిస్తామన్నారు ఇందిరాగాంధీ సెంటర్ వారు. కార్యవర్గం అంగీకరించిన ఈ నిర్ణయానికి, సర్వ సభ్య ఆమోదం కోసమై యివ్వాళ జనరల్ బాడీ మీటింగ్.... మద్రాసు నుంచి ఈ పుస్తకాలు ఢిల్లీకి తరలించడమేమిటి, ఆ రిపేర్లు యిక్కడే చేసి, పుస్తకాలు ఇక్కడే వుంచవచ్చుకదా అని ఈ తరలింపుకి అభ్యంతరం తెలిపారు కొందరు. వారి సూచనలు ఆమోదించడమో, నిరాకరించడమో తప్ప, షరతులు విధించే అవకాశంగాని, అధికారంగాని, మనకి లేవు – అన్నారు కార్యవర్గ సభ్యులు. సభాధ్యక్షులుగా వ్యవహరించిన యస్ గోపాల్ (రాధాకృష్ణన్ కుమారుడు - నెహ్రూ హిస్టోరియన్) తీర్మానాన్ని వోటింగ్‌కి పెట్టారు. ఇందిరాగాంధీ సెంటర్‌వారి సహాయానికి అనుకూలంగా వోటు చేసినవారు, నాతో కలిపి పదహారు గురు: ప్రతికూలంగా ఆరుగురు. తీర్మానం ఆమోదింపబడింది. మద్రాసు లిటరరీ సొసైటీకి మంచి రోజులు రానున్నాయి.

... 23

అక్టోబరులో ఢిల్లీ వెళ్లినప్పుడు శ్యాణీ లక్ష్మీనారాయణుని అడిగాను - నాన్నగారు ఎక్కడ వున్నారని! హైదరాబాదులో సిస్టర్ వద్ద వున్నారని చెప్పారామె. అందువల్ల ఆయనని చూడటం పడలేదు. కాని ఇంతలోనే ఒక వైణిక విద్వాంసుని ఇహలోక యాత్ర ముగియనున్నదని అనుకోలేక పోయాను.... విని, ఆనందించడమే తప్ప సంగీతంలోని లోతుపాతులు నాకంతగా తెలియవు. చిట్టిబాబు వంటి ఎందరో 'ప్రముఖులకు గురువైన ఈమని శంకరశాస్త్రి వీణాగానం వింటున్నప్పుడు, ఏదో అలౌకిక ప్రపంచంలో, మబ్బుల్లో తేలుతున్నట్టు ఉంటుంది. ఆ శ్రవణానందానుభూతి మాటల్లో బందీకృతం కాదు.... కళ్యాణి, మా శారదాంబ స్టూడెంట్ - చిల్డ్రన్స్ గార్డెన్ స్కూలులో! శారదాంబ కొలీగ్ లక్ష్మి, శంకరశాస్త్రి గారి అబ్బాయి వుంటున్న ఇంట్లో మరొక ఫ్లోర్‌లో ఉంటున్నారు. అంచేత, ఉదయం ఎనిమిదిన్నరకే వార్త తెలిసింది - సన్మానమూ సంగీత సభా అయాక, గుంటూరు నుంచి సర్కారులో వస్తున్న ఈమని (కొడుకు వెంట వున్నాడు). ఉదయం అయిదు గంటలకి కంపార్ట్‌మెంటులోనే కంగారుపెట్టారనీ, 'బాడీ' యింటికి తీసుకువచ్చారనీ! ఆలివర్ రోడ్డులోని వారింటికి వెళ్లి, ఆ పుణ్యమూర్తికి నమస్కరించి వచ్చాను.... 1985 ఒకటోతేదీ 'డైరీ'లో ('జగతి' - 348) 'మర్యాదంతా వారితో గడిచింది - ఈ నాలుగు ముక్కలలో చెప్పే పరిచయం కాదది- వివరంగా విపులంగా చెప్పదగు అపూర్వానుభూతి.......... అదంతా

యిప్పుడు కాదు - మరొకసారి' - అన్నాను, – ఢిల్లీనుంచి మద్రాసు వస్తూ జిటి ఎసిస్లీపరులో ఏప్రిల్ రెండవతేదీ పగలంతా వారితో గడిపిన సందర్భంగా! మరొకసారి శంకరశాస్త్రి గారిని కలుసుకొని, ఆర్టికల్ రాదామనుకున్నాను. కాని, ఆ అవకాశం వానగూడలేదు. చేదామనుకొని, చేయలేకపోయిన వాటిలో యిదొకటి.... పన్నెండవ ఏటనుంచీ కచ్చేరీలు చేస్తున్న శంకరశాస్త్రి, కర్ణాటక సంగీత విద్వాంసులైన అచ్యుత రామశాస్త్రి కుమారుడు. ద్రాక్షారామలో జననం, కాకినాడ పి ఆర్ కాలేజీలో చదువు. ఈ మ్యూజికల్ జీనియస్ 1959లో ఆలిండియా రేడియోలో ప్రొడ్యూసర్‌గా ప్రవేశించి, డైరక్టర్ ఆఫ్ నేషనల్ ఆర్కెస్ట్రాగా రిటైరయారు. సంగీతం ద్వారా జాతీయ సమైక్యతకు కృషి చేసిన మహావిద్వాంసుడాయన. 'గమకాలు' గురించి ఆయన చేసిన పరిశోధన భారతీయ సంగీతపు ఔన్నత్యాని ఎంతగానో పెంచింది. ఐక్యరాజ్యసమితి కార్యాలయంలో వీణపై ఆయన పలికించిన శాంతివచనం (Vedic Shanti Mantra) యిప్పటికీ ఘనంగా చెప్పుకుంటారట. న్యూయార్క్ ఆయనని వీణా విశారద (Veena Virtuoso) అంది. కెనడా బ్రహ్మరథం పట్టింది. పారిస్ నగరం ప్రశంసలు కురిపించింది. రోమ్‌లో ఘనంగా మెచ్చుకొన్నారు.... మూడేళ్ల క్రితం టానా (Telugu Association of North America) ఐసిసిఆర్ (Indian Council for Cultural Relations) నాలుగు నెలల పర్యటనకు ఏర్పాటుచేయగా, అనేకానేక బిరుదులుగల ఈ వైణిక శిఖామణి, పద్మశ్రీ ఈమని శంకరశాస్త్రి, అమెరికాలోని ప్రధాన నగరాలన్నిటా కచ్చేరీలు చేసి, 'వీణ'కు అంతర్జాతీయ గౌరవమూ ఖ్యాతీ తెచ్చారు. తనలోని విద్యను శిష్య వర్గానికి అందించిన ఈమని శంకరశాస్త్రి ధన్యజీవి.... వారి కుటుంబానికి మాగాఢ సంతాపం తెలియబరుస్తున్నాము.

...... 27

ఇండియన్ ఫైన్ ఆర్ట్స్ సొసైటీ (Indian Fine Arts Society) వారి సంగీతోత్సవ సందర్భంగా 'శంకరదాస్'లో అన్నమాచార్యపై డా॥ పప్పు వేణుగోపాలరావు లెక్చర్ - డిమాన్‌స్ట్రేషన్; డిమాన్‌స్ట్రేటర్; ప్రముఖ గాయకులైన బాలకృష్ణ ప్రసాద్.... "'సంగీత రత్నాకరమ్'తో వాగ్గేయకారునికి నిర్వచన చెప్పారు సారంగదేవ్.... అష్టపదులు రచించిన జయదేవ్ మనకు తెలిసిన ప్రథమ వాగ్గేయకారుడు సంస్కృతంలో! అయితే, 'తేవారమ్‌లు' అంతకి పూర్వానివని మనం అంగీకరించాలి. నాలాయిర దివ్య ప్రబంధం తాలూకు ప్రభావం అన్నమాచార్య మీద లేదని అనలేము. ఈయన 32 వేల పదాలు వ్రాశాడని ప్రతీతి — అందులో 14 వేల చిల్లర మట్టుకే వెలుగులోకి వచ్చాయి........ మూడు శతాబ్దులపాటు మరుగున పడిపోయిన

ఈ సంకీర్తనల ఉనికి కనుగొన్నది 1860లో కాంబెల్ అనే దొరగారు. ఆ తర్వాత ఈ శతాబ్ది ప్రథమార్థంలో రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ, వేటూరి ప్రభాకరశాస్త్రి అన్నమయ్య విషయం ఎంతో పరిశోధన జరిపారు........ 1408 మే 7వ తేదిన జన్మించిన అన్నమాచార్య 1503 ఫిబ్రవరి 25వ తేదిన పరమపదించినట్లుగా దాఖలా కనిపిస్తోంది – అంటే, యించుమించు తొంభయ్యయిదేళ్లు జీవించారు. ఆయన భార్య తిమ్మక్క వ్రాసిన 'సుభద్రా కల్యాణం' ఒక ఉత్తమ కావ్యం.... పురందరదాసు (1488 - 1564) ఈయన తర్వాత జనించిన వాగ్గేయ కారుడు... సంసార మార్గం త్యజించక, సంసార బంధాలలో ఉంటూనే కులానికి గాక గుణానికి ప్రాధాన్య మిస్తూ, ఆధిభౌతికం నుంచి ఆధ్యాత్మికత వైపు దృష్టి సారిస్తూ, పరమయోగులకు సైతం పలు రూపాల కనిపించే శ్రీహరిని, శృంగార భావం తోను, తాత్త్వికచింతనతోను కీర్తించి, రాగి రేకులపై ఆ సంకీర్తనలు పొందు పరిచిన పద కవితా పితామహుడు అన్నమాచార్య" అన్నారు డా॥ పప్పు వేణుగోపాలరావు – బాలకృష్ణ ప్రసాద్ ఆయా సందర్భాలను తన గాన మాధుర్యంతో కలుపుతుండగా!........ భావింప సకల సంపదల రూపమదిగో, బ్రహ్మ కడిగిన పాదము, ఎటువంటి మోహమో ఎట్టి తమకమో గాని, తావి జల్లెడుమోము – తమ్మికడు వికసించె, ఏమొకొ చిగురుట ధరమున– ఎడబడ కస్తూరి నిండెను – భామిని విభునకు వ్రాసిన పత్రిక కాదు కద, ప్రాణేశ్వరుపై నాటిన ఆ కొన చూపులు, ఎక్కడ- మానుష జన్మంబెత్తిన ఫలమే మున్నది, అంగన లీరే హారతులు .... – ఆ ముప్పావుగంటా బాలకృష్ణ ప్రసాద్ శ్రోతలను అన్నమయ్య లోకంలో, ఆ రాగజలధిలో విహరింప జేశారు. 'ఐఎఫ్ఎయస్' అధ్యక్షులు ఎంబెరుమన్నార్ చెట్టి, ఈ ఉదయం వేళ సంగీత సుమదళాలు పంచిన బాల కృష్ణ ప్రసాద్‌కీ, వేణుగోపాలరావుకీ అభినందనలు తెలిపారు.

. . . . . 30

నాగయ్య స్మారక సమితివారు (అధ్యక్షులు : డా॥ ఇంటూరి ; కార్యదర్శి : రాళ్లబండి) నాట్యయోగి నాగయ్య పథ్నాలుగవ వర్ధంతి ఛాంబర్లో జరిపి, ఆ తర్వాత వాహినీవారి 'వందే మాతరం' ప్రదర్శించారు. నిరుద్యోగి రఘు (నాగయ్య) నలభై అయిదేళ్లనాటి సగటు పట్టభద్రుడు ; భార్య జానకి (కాంచనమాల) అత్తింటి కోడలు ; కొడుకు ఆనంద్ (మొదట ఉషారాణి, అయిదేళ్ల అనంతరం అశ్వద్ధామ) ప్రేమార్చనకు, దైవార్చనకు పువ్వు లమ్మిన పసివాడు. పిల్లలకు పాఠాలు చెబుతూ దేశభక్తి ప్రబోధం ద్వారా తన మనోవ్యథ మర్చిపోగలిగిన టీచరు, సేవాధర్మమే జీవితానికి వెలుగునిస్తుందని చెప్పే ఆమె తండ్రి, కోడలు జానకి పట్ల నిరాదరణ, కూతురు పట్ల అవధుల్లేని ప్రేమ గల

గయ్యాళి అత్తగారు, ఆమెని ఎదిరించ లేని భర్త, వీధినాటకాల పిచ్చి గల అల్లుడూ వున్న (వందేమాతరం అల్లుడు – జోగారావు) ఈ పిక్చరు, బియన్ రెడ్డి దర్శకత్వం వహించిన ప్రథమ చిత్రం. ఆర్థిక విజయం సాధించడమే గాక నాగయ్యను ఒక గొప్ప నటునిగా తీర్చి దిద్దింది.

. . . . . 31

"1987 లో మీకు మంచి జరిగింది - 1988 మీకు మరింత మంచిని తేవాలి" - అంటూ శుభా కాంక్షలు తెలిపేందుకు స్వయంగా వచ్చిన శాస్త్రిగారు, మాటల సంద ర్భంలో "మీరు 'డైరీ'లో రయిల్వే డిపార్టుమెంటూ, ఇండియన్ ఎయిర్ లైన్సూ, మన ఢిల్లీ ఫెస్టివల్ విష యంలో చూపిన సహకారం గురించి ప్రస్తావించలేదు" - అన్నారు. అప్పట్లో నాకా విషయమంతగా తెలీదు - తర్వాత తెలిసింది. వెళ్లేందుకు వచ్చేం దుకు బెర్తుల విషయంలో నయితేనేమి బోలెడంత లగేజి విగ్రహాలూ యిత్యా దులు బుకింగ్ విషయంలో నైతెనేమి, రైల్వేశాఖవారు చూపిన సహకారం, ముఖ్యంగా సీనియర్ కమర్షియల్ ఆఫీసరు చక్రధరరావు తీసుకున్న శ్రద్ధ మరువలేనిది. వారందరి తోడ్పాటు వల్లనే ఫెస్టివల్ సక్రమంగా జరిగింది. అలాగే ఇండియన్ ఎయిర్ లైన్సు ఉద్యోగి వెంకటప్పయ్య, రోజా ఫ్లవర్ బాస్కెట్స్ కరెక్టుగా టాల్ కటోరా చేరేందుకు, ఎంతో శ్రద్ధ తీసు కున్నారు. 'రయిల్వేస్'లో చక్రధరరావు ఎయిర్ లైన్స్‌లో వెంకటప్పయ్య మన ఢిల్లీ ఫెస్టివల్ విజయవంతమవడాని కిచ్చిన సహాయ సహకారాలు మరువ లేనివి' - అన్నారు టివికె శాస్త్రి.... శాస్త్రిగారు ఈ ఫెస్టివల్‌కి సారథి మాత్రమే. భారత్ కల్చరల్ ఇంటి గ్రేషన్ కమిటీవారి మహదాశయం, సంగీతోత్సవాల ద్వారా పలికే ఆ జాతీయ సమైక్యతా గానం, ఎంద రెందరి హృదయాలనో స్పందింప జేస్తోంది.

## 1987 డిసెంబరు 31

పదిహేను రోజుల క్రితం రాధా శివస్వామి టెలిఫోనులో 'ముప్ఫయి ఒకటో తేదిన మీరూ మాలతిగారూ ఊళ్లోనే ఉంటున్నారుగా?' అని అడి గారు, 'ఉంటున్నాం — ఏమిటి విశేషం?' - అని నా ప్రశ్న. 'ఆ, ఏమీ లేదు - హేమా రామేశం యింట్లో పది పన్నెండు ఫామిలీస్ కలుసు కుంటున్నాం - హాపీ న్యూ ఇయర్ అక్కడ గడిపేందుకు! మీ యిద్దరూ కూడా వస్తున్నారు' - అన్నారామె. శివస్వామి దంపతులు మాకెంతో సన్నిహితులు - వారి మాట కాదనే ప్రసక్తి లేదు.... అయిదారు రోజుల క్రితం మళ్లీ టెలిఫోన్‌లో చెప్పారు రాధ: 'డాక్టర్ సత్యమూర్తి మిసెస్సూ వాళ్ల మారుతిలో మీ యిద్దరినీ తీసు కొస్తారు. ఎనిమిదీ ఎనిమిదింబావుకి వస్తారు మీ యింటికి. మళ్లీ మిమ్మల్ని మీ యింటి దగ్గిర ఒంటిగంట లోపున

దిగబెడతారు.... మా లేడీసందరం కలిసి మాలతిగారిని ఆనర్ చేయదలుచుకున్నాం; ఆమె కాదనకూడదు — మీరు కన్విన్స్ చేయాలి'.... ఈ ఆనర్ చేయడం గురించి లోగడ ఒకటి రెండు సార్లు ప్రస్తావించారు రాధ. ఫామిలీ ఫ్రెండ్స్ తప్ప కొత్తవాళ్లెవరూ వుండని గాదరింగ్. భానుమతీ రామకృష్ణ కూడా తప్పకుండా వస్తానన్నారు. ఇందరు సన్నిహితుల మధ్య పాత సంవత్సరానికి వీడ్కోలు తెలిపి, కొత్త సంవత్సరానికి స్వాగతం పలకడం ఎవరికి సంతోషంగా ఉండదుగనక! .... సత్యమూర్తి దంపతులూ, మేమూ సరిగ్గా టైముకి చేరుకున్నాం. అప్పటికే పదిహేనూ ఇరవై మంది వచ్చివున్నారు. హనుమంతరావుగారు బార్ వెనక హడావిడిగా ఉన్నారు; రాజేంద్రప్రసాద్ ఆసక్తి జనకమైన కబుర్లు చెబుతున్నారు; శివస్వామి సరేసరి - ఈ 'గెట్-టు-గెదర్' సూత్రధారీ రాధ అవడంవల్ల ఆయన అన్నీ తానై తిరుగుతున్నారు; రామేశం అబుదాబీలో ఉన్నారు - పదిగంటల వేళ అక్కడ నుంచి ఫోన్ చేసి పేరు పేరున అందరినీ కనుక్కున్నారు; శరత్‌నీ (అపొల్లో డాక్టర్ - శోభన్‌బాబు అల్లుడు) మంజులనీ కలుసుకు యించుమించు మూడేళ్లయింది; ప్రకాశరావుగారి కోడలు సరళని పరిచయం చేసింది మాలతి; కథక్ డాన్సర్ పుష్పని చూడటం అదే మొదటిసారి ఆమె భర్త వుహో, 'మా ఆవిడ ఫారెన్‌లో పెర్‌ఫారమెన్స్ యిస్తున్నప్పుడు నాలుగు డబ్బులు మిగుల్తాయి - కాని స్వదేశంలో యిచ్చిందా నా చేతి చమురు' - అన్నారు - ఆయనకి అస్సాంలోనూ, మద్రాసులోను బిజినెస్ ఉంది; 'మాలతిగారి కారణంగా మా ఆవిడ యిల్లు కదిలింది' — అని చెప్పారు గుప్తాగారు; పుల్లయ్యగారి (శాంత కుమారి) అమ్మాయి, అల్లుడూ వచ్చారు - వారు కూడా అబుదాబీ వాసులే. శరత్‌చంద్రుని ఏనాడో మేము తెలుగు రచయితగా చేసేసుకున్నామని చెప్పాము బెంగాలీ మిత్రునితో; శంభుప్రసాద్, నారాయణన్ మున్నగువారు చిరపరిచితులు.... పది గంటల వేళ మాలతీ చందూర్‌ని ఒక పక్కగా పిలిచి, సోఫాలో కూచోబెట్టి, గంధం రాసి, పన్నీరు జల్లి, పూలమాల వేసి, బ్రవున్ కవరొకటి చేతిలో పెట్టారు - 'ఏమిటి' అని ప్రశ్నించే అవకాశం లేకుండా! ఆ పూలదండ, కవరూ లోపలికి పట్టుకెళ్లి దాచారు సుందరీ, హేమానూ - వెళ్తున్నప్పుడు మర్చిపోకండి అని హెచ్చరిస్తూ.... ఆ తర్వాత మిసెస్ నారాయణన్ ఎంతో శ్రావ్యంగా త్యాగరాయ కృతి పాడారు; మరొకటి అన్నప్పుడు నిరాకరించక తన మంజుల గానంతో శ్రోతలను ఆనందింప జేశారు. ఆ తర్వాత పద్మ, సుందరి యింకా యిద్దరు ముగ్గురు పాడారు. పుష్పవిలాపమూ, ఎంకిపాట, గజల్స్‌తో డిన్నర్‌కి ముందూ తర్వాత కూడా శివస్వామి. పార్టీలోని ఫ్రెండ్స్ అందరినీ రంజింపజేశారు.... మాలతీ చందూర్‌పై తమ అభిమానం అనురాగం వ్యక్తం చేసేందు

కని ఉద్దేశించిన ఈ మైత్రీ సమావేశంలో, నూతన సంవత్సరోదయ సందర్భంగా నలుగురైదుగురు లేడీస్ తలపెట్టిన ఈ చక్కటి పార్టీలో, ప్రతి ఒక్కరి మనసూ పూలడోలిక అయింది. ఫొటోలు వద్దు, విడియోలు వద్దు, పత్రికలూ పబ్లిసిటీ వద్దు, ఉపన్యాసాలూ, వేదికలూ వద్దు. మా మనసుల్లో నిలిచిన మాలతిగారిని, మామధ్య కూచోబెట్టుకు, నాలుగు మాటలు సరదాగా చెప్పుకోవడమే మాకు కావల్సింది' - అని మొదట నుంచీ అంటూనే వున్నారు రాధా శివస్వామి. రాధా హేమ లిరువురూ ఒక పూల పందిరి వేసి, ఆ స్నేహ ప్రసూన పరిమళంలో మమ్మల్నందరినీ పరవశింపజేశారు. అది కంప్లీట్‌గా స్త్రీలపార్టీ - వారికి తోడు వుండటమూ, గ్లాసు చేతబుచ్చుకు చూస్తూ నిలబడటం తప్ప పురుషుల ప్రమేయమేమీ లేదందులో. మాలతీ చందూర్ దంపతులు ఎన్నటికీ మరువలేని ఒక అపూర్వ ఆనందానుభూతి అది.... పన్నెండున్నరకి వీడ్కోలు తీసుకుంటున్నప్పుడు కృతజ్ఞత అనే మాటతో ఈ మంచి గంధాన్ని మాధుర్యాన్ని మలినం చేయను - అంది మాలతి - రాధనీ హేమనీ చెరో చేతో పట్టుకు.... ఇంతకీ ఆ బ్రవున్ కవరులో ఏమున్నదో చెప్పాలికద! పది వేల అయిదువందల నలభైనాలుగు రూపాయిలు - వందనోట్లు, ఏభైలు, పదులు. అయిదులు, రెళ్లు, ఒకట్లు, - మొత్తం రు 10, 544/- కొందరు కొందరిచ్చిన నోట్లు జెమ్‌క్లిప్స్‌తో బాటు అలానే వున్నాయి. మాలతీ చందూర్‌ని తాము, అంటే నలుగురైదుగురు, పది వేలకి తక్కువగాని పర్సుతో అనర్ చేదామనుకున్నారట. అయితేమేమంటే, మేము అని కొందరు ఉత్సాహం చూపడం వల్ల, మొత్తం సంఖ్య పదిమందికి దాటకూడదనుకున్నారట. ఆ పదిమందీ ఎవరంటే ; శ్రీమతులు హేమారామేశం, రాధా శివస్వామి, సుందరీ హనుమంతరావు, భానుమతీ రామకృష్ణ, సరళా రాఘవేంద్రరావు, మణీ నరసింహారావు, ప్రభావతీ శంభుప్రసాద్, కమలాదేవి ప్రసాద్, లీలావతీ గుప్తా, విమలా రాజేంద్ర ప్రసాద్.... అందరూ కలిసి ఆ పర్సు ప్రజెంట్ చేశారు.... పది రూపాయిలు ఖర్చుపెట్టి పాతిక రూపాయిల పబ్లిసిటీ ఆశించే ఈ రోజుల్లో, ఈ పదిమందిలో ఏ ఒక్కరికీ తమ పేరు సైతం పైకి చెప్పడం యిష్టం లేదు. ఫొటోలు, విడియోలు, ఉపన్యాసాలు, పత్రికలు, పబ్లిసిటీ - వీటి గురించి ముందే చెప్పాను కద ! అలాటివాటికి వీరు బద్ధ వ్యతిరేకం. అయితే, మాలతి పుచ్చుకున్నది గనుక వారిపేర్లు వెల్లడించవలసిన నైతిక బాధ్యత మాపై ఉంది. అది కూడా శివస్వామి దంపతులతో స్వయంగా మాట్లాడి, వారి ఆమోదం పొందిన మీదట వెల్లడిస్తున్నాను మాకున్న సంపద యావత్తు మామిత్రులే ఆ మహా సంపదే మా జీవితాలకు నిబ్బరమూ నిండుతనమూ నిస్తోంది.

—యన్నార్ చందూర్

# కొత్త పుస్తకాలు

"ఋగ్వేద ఆర్యులు" - రాహుల్ సాంకృత్యాయన్ ; తెలుగు ; మిక్కిలినేని సుబ్బారావు ; ప్రచురణ : విశాలాంధ్ర పబ్లిషింగ్ హవుస్, విజ్ఞాన భవన్, 4 -1 - 430 బ్యాంక్ స్ట్రీట్, హైదరాబాదు - 500001. వెల: రు. 20-00.

ఋగ్వేదంలో 10,467 ఋక్కులు పది మండలాలుగ విభజించబడి వుంటాయి. రుక్కులు అంటే అనేకఛందస్సులలో (ముఖ్యమైనవి ఏడు) రచించిన పద్యాలు. వీటినే సూక్తాలని కూడా అంటారు. ఇవన్నీ క్షుణ్ణంగా పరిశీలించి, ఋగ్వేదం రచించిన కాలంలో ఆర్యుల జీవన విధానం ఎట్లా వుండేదో వర్ణిస్తూ 255 పుటల ఆసక్తికరమైన గ్రంథం రచించారు సాంకృత్యాయన్. ఆర్యులు సప్తసింధు ప్రాంతాలలో స్థిరపడినప్పుడు ఋగ్వేద రచన జరిగిందని.... వీరి అభిప్రాయం - అంటే క్రీ. పూ. 1500 సుమారుగా. నీలకంఠశాస్త్రి, మొదలగు చరిత్రకారులు ఆర్యులు పశ్చిమ ఆసియా ప్రాంతాల నుండి పచ్చిక బయళ్ళకోసం వెతుకుతూ సింధుతీరాలవైపుగా ప్రయాణం చేస్తున్నప్పుడు రుక్కులను ఆశువుగా చెప్పుకుంటూ వచ్చారని అంటారు.

గ్రంథం ఆదిలోనే రచయిత "దేవుడు అబద్ధం, అంతేకాదు అతడు గొప్ప అనర్థకాలకు కారకుడయ్యాడు. కాని దేవతలు అనేకములైన సుందరమైన కళలకు ఆధారములైనందున వారు అమూల్యములూ, స్పృహణీయులూ అవుతున్నారు" అనే తమ విశ్వాసాన్ని స్పష్టంగా చెప్పడం వల్ల, పవిత్ర వేదాలను యీ రచయిత కుతర్కం తో వ క్రీ కరిస్తున్నారని ఛాందసులు బాధపడనక్కర లేదు ఆకాలంనాటి చారిత్రక, వైజ్ఞానిక సాంస్కృతిక సమాచారం తెలుసుకోవడానికి ఋగ్వేదం ఆధారం కాబట్టి అది విలువైనది.

ఆర్యులు చేసిన రెండు ముఖ్యమైన భయంకరమైన యుద్ధాల ప్రసక్తి ఋక్కుల్లో వుంటుంది. క్రీ. పూ. 2500 నాటికే (హరప్పా, మోహెంజొదారో) గొప్ప నాగరికత సాధించిన ద్రావిడులను, సింధు ప్రాంతాల నుండి తరిమివెయ్యడం ఒకటి. ఓడిపోయిన ద్రావిడులు కొందరిని తమకు దస్యులరు చేసుకుంటారు ; మిగిలిన వారు. తూర్పుకు దక్షిణానికి పారిపోతారు హిమాలయ పర్వత ప్రాతాలలో వుండే పార్వతేయులు లేక కిరాతు

లతో జరిపినది రెండవ యుద్ధం. 'శంబరుడు' అనే కిరాతనాయకుడితో దివోదాసు 40 సంవత్సరాల పాటు పోరు సల్పి అతని 99 దుర్గాలను నాశనం చేస్తాడు. దివోదాసు, అతని పుత్రుడు సుదాసు, అంతకంటె ప్రాచీనులైన మనువు, పురూరవుడు, నహుషుడు, యయాతి, మంధాత మొదలైన రాజుల పేర్లు ఋగ్వేదంలో కనబడతాయి. ఆర్యులు కొత్తగా సింధు ప్రాంతంలో నివాసం ఏర్పరుచుకున్నప్పుడు వీరి 'గణములు' లేక 'జనములు' అయిదే. పురులు, యదులు, తుర్వశులు, ద్రుహ్యులు, అనులు. పురులలో ఒక శాఖవారు 'భరతులు' -దివోదాసు, సుదాసు యీ శాఖకు చెందిన వారు. ఈ శాఖ పేరు మీదే మన దేశానికి భరతఖండం అనే పేరు వచ్చింది. 'సింధు'ను యిరాను భాషలో 'హిందు' అనడంవల్ల మన దేశానికి మరొకపేరు హిందూ దేశం అయింది. ఆర్యులలో ఒక శాఖ యిరానులో స్థిరపడగా, మరొక శాఖ సింధు వైపు రావడంవల్ల వారికీ సింధు ఆర్యులకూ భాషలో ఆచారాలలో చాలా పోలికలు కనబడతాయి.

ఓడించిన కిరాతులను, ద్రవిడులనూ దస్యులుగా చేసుకున్నాకే వర్ణ భేదం అన్నది కూడా ఆరంభమయింది. ఆర్యులు తెల్లనివారు, బంగారు రంగు జుట్టు, నీలి కన్నులు వున్నవారవుతే, దస్యులు కృష్ణ శరీరం కలవారవడం దీనికి కారణం.

ఆర్యులు వున్ని వస్త్రాలు ధరించేవారు. ద్రవిడులు నూలు నేయడం అప్పటికే నేర్చుకొని వుండటంవల్ల నేత వస్త్రాలు ధరించేవారు. ఋగ్వేదకాలం నాటికి 'అంటు' అనేది కూడా ఆర్యులు ఆచరిస్తుండటంవల్ల నూలు వస్త్రాలు 'అంటు' అనీ, వున్ని వస్త్రాలకు అది లేదనే అలవాటు ఆరంభమయింది. ఆ కాలం నాటి యింకొక అలవాటు కూడా యీనాటి కొన్ని కుటుంబాలలో కనిపిస్తుంది. అది పిండిని (కరంభ) పెరుగులో కలిపి ఆహారంగా భుజించడం. 'పేల పిండి'ని పెరుగులో కలుపుకొని ఆచారవంతులైన వారు భోజనంగా తీసుకోవడం మనవైపుల వున్నది.

ద్రవిడులతోపాటు 'పణులు' అనే వ్యాపారులను కూడ ఆర్యులు చిన్న చూపు చూస్తుండేవారు. అయితే వారి వద్ద నుండి నూలు వస్త్రాలు, గోవులు, రత్నాలు, ఆభరణాలు కొంటూనే దేవతల పేరు, యజ్ఞ యాగాల పేరు చెప్పి వారిని దోపిడీ కూడా చేస్తుండేవారుట.

ఋగ్వేద ఋషుల సంఖ్య 350 వరకూ వున్నదని రాహూల్‌జీ అభిప్రాయం. వీరిలో భరద్వాజుడు, వశిష్ఠుడు, విశ్వామిత్రుడు, వామదేవుడు మొదలయినవారు చాలా ప్రధానమైన వారు. వీరంతా రాజ పురోహితులు, ప్రధాన మంత్రులు, సేనానాయకులు కూడా. 'గణము' పొందే విజయమూ, అభివృద్ధీ పురోహితుడి శక్తి సామర్థ్యాల మీదే ఆధారపడి వుండేది. ఇక

యజ్ఞ యాగాలు చేయడం వీరి ఆధ్వ ర్యం క్రిందే! అది అందరికీ తెలిసిన విషయం.

విశ్వామిత్రుడు తన సూక్తాల్లో 3,339 గురు దేవుళ్ళనూ, 33 మంది దేవతలనూ స్తుతించాడు. ఋగ్వేద కాలానికి పూర్వం ద్యౌ (ఆకాశం), పృథ్వీలను పూజించేవారు. వీరిద్దరూ అందరికీ 'పితరౌ' (తల్లి దండ్రులు). క్రమంగా ఉష, సరస్వతి (నది), సూర్యుడు, వరుణుడు, అగ్ని మొదలైన వారిని దేవతలుగ స్తుతించారు. అందరి లోకి అత్యంత ప్రధానుడు ఇంద్రుడు, సర్వలోక రక్షకుడు అని నమ్మారు. అసలు చాలా వరకు ఋక్కులన్నీ యితన్ని శ్లాఘించడానికి రచించినవే. కాని యింద్రుడు వున్నాడా లేడా అని ప్రశ్నించిన నేమ ఋషి ఋక్కుకు కూడా ఋగ్వేదంలో స్థానం వుంది. ఆప అనే పేరుతో జలము, నదులను, ఇళా (అన్నము), అరణ్యము మొదలైన దేవులను కూడా ఆర్యులు పూజించారు. సౌందర్య భరితమైన పద్యాలలో స్తుతిం చారు. అరణ్యాన్ని గురించిన యీ స్తుతి ఎంతో మనోహరంగా వున్నది. "నల్లని వర్ణము కలది, సుగంధ భరితమైనది, సేద్యము లేకనే అన్నము-నిచ్చునది, మృగములకు మాత అయిన అరణ్యము లను నేను స్తుతిస్తున్నాను". (రచన: ఇరమ్మదపుత్ర దేవముని)

ఈ దేవతలతో పాటు 'పితరులు' (మరణించిన పూర్వీకులు) కూడా పూజార్హులే. అశ్వినీ కుమారులు వైద్యా నికి దేవతలుగా కీర్తించబడినవారు. పురుష సూక్తంలో బ్రహ్మాండమయ విరాట్ పురుషుని స్తుతించారు. ప్రజా పతి ముందు ముందు ఆవిర్భవించ బోయే (వుపనిషత్తుల కాలం) బ్రహ్మ భావనకు మూలం. 10వ మండలంలో వున్న ప్రజాపతి సూక్తంలో అజ్ఞేయ బ్రహ్మ వర్ణన, సృష్టి పుట్టుక గురించి జిజ్ఞాస వుంటాయి.

9 వ మండలంలో చాలా భాగం సోముని కీర్తించేవే. ఆర్యులకు సోమ పానం చాలా ప్రియమైనది. సురా పానం, జూదం ఋషులు నిషేధించినా సోమపానాన్ని పొగుడుతూ ప్రతి ఋషీ అనేక సూక్తాలు రచించడం ఆశ్చర్యం గానే వుంటుంది.

ఆర్యులు తమ స్త్రీలకు ఆయుధాలు యివ్వలేదు. దస్యులలో స్త్రీలు యుద్ధంలో పాల్గొనేవారు. వూర్వశీ, పురూరవుల సంభాషణ (10వ మండలం, 95వ సూక్తం) చూస్తుంటే మాత్రం ఆర్య స్త్రీలు ధృఢమైన వ్యక్తిత్వం గలవారుగా తోస్తుంది. ఋగ్వేదంలో వున్న విషాద ప్రణయ గాథ యీ వూర్వశీ పురూరవుల కథ. ఈ ఋక్కుల్లో ఉత్తమ కావ్య లక్షణా లున్నాయని రచయిత చెప్తున్నారు. ఎందరో స్త్రీల పేర్లతో ఋక్కులు వున్నా, ఘోష, విశ్వవార అనే యిద్దరు మాత్రం నిజంగా ఒకప్పుడు జీవించిన స్త్రీలు అనీ, వీరి రచనలో గొప్ప కవిత్వమున్నదనీ కూడా సాంకృత్యాయన్ అంటారు.

ఇటువంటి గ్రంథ రచన ఎంతో శ్రమతో కూడినది. అనువదించడమూ కష్టసాధ్యమైన పనే. మిక్కిలినేని సుబ్బారావు అనువాదం సులభ గ్రాహ్యంగా సాగుతుంది.

చరిత్రనూ, సంస్కృతినీ ఆవేశరహితంగా పరిశీలించాలనే ఆసక్తి వున్న వారికి నచ్చే గ్రంథం.

-సరోజినీ ప్రేమ్‌చంద్

*

## ఈ మధ్య అందినవి:

నీతి కథలు - మూడవ భాగం, నాలుగవ భాగం. మౌలానా అఫ్‌జల్ హుస్సైన్ మాతృకకు అబ్బాదుల్లా తెలుగు అనువాదం: తెలుగు ఇస్లామిక్ పబ్లికేషన్స్, హైదరాబాదు-2. ఒకొక్కటి: రు 2-75.... ఇస్లాం - రాజకీయ సిద్ధాంతం. అదే సంస్థ. మౌలానా మౌదూది మాతృక మలిక్ తెలుగు రు 3-40.

అలలకు ఓటమి లేదు - వచన కవితా సంపుటి;.... రు 7-00; కొత్తయుగం - సాహిత్య వ్యాసాలు... రు 10-00.... పైరెండు పుస్తకాల రచయిత: ఏ. సూర్యప్రకాష్.... రచన పబ్లిషర్స్, అర్మూరు - 530224.

జలఖడ్గ - కవిత. విజయసారధి సాహితీ స్రవంతి, ఖర్గపూర్ -1.... రు 5-00.

అద్దం - కవిత. మాధవీ సనారా విస్ఫోటం ప్రచురణ, ఖరగ్‌పూర్ - 721301.... రు 2-00.

Conservation and Progress ... Our Heritage ... Values and Growth. పాండుచ్చేరి లెఫ్టినెంట్ గవర్నరు త్రిభువన ప్రసాద్ తివారీ - వ్యాసాలు, ఉపన్యాసాలు సంకలనం - మూడు, నాలుగు, అయిదు సంపుటాలు. ప్రభుత్వ సమాచారశాఖ డైరక్టరేట్, పాండుచ్చేరి.



# మన రిపబ్లిక్ స్వాతంత్ర్యత




" ఈ ఫలాన్ని మనం ఏమి చేస్తామన్నది అనేక అంశాలపై ఆధారపడి ఉంటుంది వాటిలోని మూలాంశాలను గాంధీజీ తన జీవితకాల పర్యంతమూ నొక్కి చెప్పారు-ఉన్నత శీలము, ఆలోచన మరియు లక్ష్యాలలో సంపూర్ణత, సహనశీలత, సహకారం, కఠిన పరిశ్రమ ఈ మూల లక్షణాల పైనని మన రిపబ్లిక్ స్వాతంత్ర్యాన్ని మనం కనుగొనాలని, మన మనస్సు నుంచి భయాన్ని, ద్వేషాన్ని విడనాడాలని, మన కోట్లాది ప్రజల పురోగతిని గురించి ఎల్లప్పుడూ ఆలోచించాలని మాత్రమే మన ప్రజానీకానికి నేను సూచించగలను"

జవహర్‌లాల్ నెహ్రూ

మన శాంతి, పురోగతులకు పటిష్టమైన పునాదులు

## సమీక్షలు చిత్రజగతి

### ఈతరం వారి 'ప్రజాస్వామ్యం'

కొడుకు, తన సొదరు ఖర్చుకి అయిదు వేలిమ్మని అడిగితే పది వేలు యిచ్చే తండ్రి శ్రీనివాసరావు, (నూతనప్రసాద్), సుపుత్రుడు ఎంత తొందరగా చెడిపోతే తనకి అంత లాభసాటి అనుకొనే రాజకీయుడు; తన బావమరిదిని మట్టుపెట్టి, ఆస్తి కాజేసి, సోదరి రాజేశ్వరి (శారద), తన యాజమాన్యంలో ఉన్న కాలేజీలో అధ్యాపకురాలిగా పని జేయవలసిన పరిస్థితి కల్పించిన యుక్తిపరుడూ నీతిబాహ్యుడూను. ఆస్తికోసం అంధురాలిని పెళ్ళి చేసుకున్న ఈ ప్రజానాయకునికి, ప్రజల సానుభూతి ఎటువంటి నయవంచనతో సంపాదించవచ్చో, ఆ విద్య బాగా తెలుసు — ఆ కళలో ఆరితేరిన ఘటం. సాక్ష్యాలను, న్యాయస్థానాన్ని తనకి అనుకూలంగా తిప్పుకోగల ఈ కుత్సితునికి, ప్రజాస్వామిక బలానికి ప్రతి రూపమైన రాజేశ్వరీదేవికీ మధ్య జరిగే వైరమే ఈ యితివృత్తం. అన్నా చెల్లెళ్లు ఒకరిపై ఒకరు వాగ్బాణాలు విసురుకోవడంలో, సంభాషణా చాతుర్యమే తప్ప స్వభావ న్యాయం కనిపించదు. శ్రీనివాసరావు కొడుకు అశోక్, మేనత్త పక్షాన నిలబడటంతో అధికార దౌర్జన్యానికీ ప్రజాస్వామిక శక్తికీ బాహాటంగా యుద్ధం జరుగుతుంది-ప్రజాస్వామ్యం విజయమొందుతుంది. పరుచూరి బ్రదర్స్ దర్శకత్వం వహించిన ఈ చిత్రంలో ఫార్ములా పద్ధతి కొంత వున్నప్పటికీ సందేశాత్మకమూ ప్రగతి బోధకమూను. సమర్పణ: బాబురావు. నిర్మాత: వెంకటేశ్వరావు.

### రోజా ఫిలింస్‌వారి 'జేబుదొంగ'

జేబులుకొట్టడమనే వృత్తిలో నిష్ణాతుడైన చిట్టిబాబుని (చిరంజీవి), ఇద్దరు సిబిఐ ఉద్యోగులు (మారువేషాలు వేదామని సలహా చెప్పే గొల్లపూడి మారుతీరావు, ఆ వేషంలో తాను ఎలా వుండేదీ ఊహించుకు విహ్వాలుడయే సత్యనారాయణ), దేశద్రోహుల ముఠాని పట్టుకొనేందుకు, నకిలీ డిటెక్టివ్ చక్రపాణిగా మార్చి, పులిబోనులోకివాదిలిపెడతారు. తన పేరు చిట్టి

బాబనీ, తను డిటెక్టివ్ ఆఫీసరుని కాననీ, ఎంత మొత్తుకున్నా యితని మాట అల కించరు దొంగల ముఠావారు. చోర వృత్తిలో చిట్టిబాబు స్థాయికి దీటైన లేడీ ఫ్రెండు (భానుప్రియ) ఒకామె ఉంది; ఆమెకి అవిటి తమ్ముడు ఉన్నాడు. ఆ తమ్ముని కోసమే నగల షాపులో సైతం తన వృత్తిధర్మాన్ని విడనాడని ఈమెలో అమాంత్రం పరివర్తనొస్తుంది. ఇక రెండో హీరోయిన్ శ్రీజ (రాధ), దొంగల ముఠాతో చేతులు కలిపి, చిట్టి బాబుని వలచి, వలపింపజేసుకుంటుంది. మొదట భానుప్రియతో, ఆ తర్వాత రాధతో కథానాయకుని శృంగార గీత మంజరి, చిరంజీవిని సినీ ప్రేక్షకులు ఎటువంటి హీరోలా చూదామనుకుంటు న్నారో ఆ వరవడిలో సాగిన ఈ సాహస కృత్యాల చిత్రానికి దర్శకులు కోదండరామిరెడ్డి. సమర్పణ: అర్జున రాజు. నిర్మాత: రామలింగరాజు

## స్రవంతీ వారి

### 'మహర్షి'

మహర్షి (రాఘవ) ప్రేమోదంతం సగటు కాలేజీ విద్యార్థి ప్రహసనంలా ప్రారంభమవుతుంది. తల్లి చిన్నప్పుడే చనిపోయింది. తండ్రి ప్రేమను కూడా నోచుకో లేకపోయాను - అని హీరో ఫిర్యాదు. పదిమందిని వెంటేసుకు తిరిగే ఈ ధనిక యువకుడు సుచిత్ర (నిశాంత) వల్ల వెంప దెబ్బ తినడంతో దిగ్భ్రాంతు డవుతాడు. తన వారి ముందు అగి రింపరాని అవమానమైనా ఆ సుకో రాంగి వేళ్ల స్పర్శ. ఆ సుమకోమల హస్తస్పర్శ, పాశవిక ప్రవృత్తిలో పెరుగుతున్న అతనిలో ప్రేమ వసంతం చిగురింపజేస్తుంది. అయితే, ఆ మొక్కని ఎలా పెంచి పెద్ద చేయాలో, తనని అసహ్యించుకుంటున్న యువతిలో కరుణార్ద్రత ఎలా కలిగించాలో తెలి యని అవివేకి. అతని మూర్ఖత్వంలో, మొండితనంలో, ప్రేమోన్మాదంలో పట్టుదలా స్వార్థబుద్ధీ అధికంగా వుంటాయే గాని ద్రవీభూత మన ప్రవృత్తి గోచరించదు. సుచిత్ర భర్త గాని, అంటి పెట్టుకున్న ఆప్తమిత్రుడు గాని మహర్షిని కాపాడలేకపోతారు. నిశాంత తన పాత్రని ఎంతో చక్కగా వొప్పించింది. విఫల ప్రేమకునిగా క్లిష్ట మైన పాత్రకు రాఘవ న్యాయం చేకూర్చాడు. విజువల్స్‌తో వుక్కిరి బిక్కిరి చేయడం, పాటలతో మెప్పించడం గాక, స్క్రీన్‌ప్లే యింకొంచెం సహేతుకంగా చేసి వుండవచ్చు. దర్శకత్వం: వంశీ. నిర్వహణ: వేమూరి సత్యనారాయణ, సమర్పణ: రవి కిషోర్, నిర్మాత: శారదాదేవి.

---

పత్రికా స్వాతంత్ర్యంపై ప్రజా స్వాతంత్ర్యం ఆధారపడి వున్నది పత్రికల నోళ్లు నొక్కి, ప్రజను కాపాడ గామనేది హాస్యమాట.

—జఫర్సన్

ఒక స్త్రీ వయసు తెలుసుకోదలుచు కుంటే, ఆమె నెప్పుడూ అడగకూడదు. ఆమె హాదినగారి నడగాలి. —హోల్

సీరియల్

# భ్రమర గీతం

## అచ్యుతవల్లి

గడిచిన కథ: రామజోగి పంతులు మనుమరాలు, తన ఉన్నతికి కారకురాలు వేళ్ల మధ్య నుంచి జారిపోతున్నట్లుగా ఆమె ప్రవర్తిస్తున్నా, టెలిగ్రామ్ యిచ్చింది గనక, తన బాధ్యత అనుకొని వచ్చాడు చలపతిరావు. వీలైతే వొప్పించి తన వెంట తీసుకొని వెళ్లాలని కూడా. అయితే, భ్రమర వంటి స్వతంత్రభావు కురాలు ఎంతటి ప్రేమలోనూ తన వ్యక్తిత్వం వొదులుకుంటుందా ? .... ఇక చదవండి.

"మన వూరికి రెండు టికెట్లు తెస్తాను, వచ్చేయి. అమ్మ నిన్ను మరీ మరీ చూడాలనుకుంటోంది!"

"అంత నిజంగా చూడాలనుకుంటే తను రావచ్చును కదా ?"

"ఆమెకి బోలెడు బాధ్యత లున్నాయి. ముఖ్యంగా తాతగారిని వదిలి ఇటూ అటూ షికార్లు ఎల్లా వేస్తుంది ?"

"అవును. తాతగారిని కాకాపట్టక పోతే. ఆస్తిపరురాలు ఎట్లా అవుతుంది ?"

"ఆస్తి ఆమె కోసమా? మీ అందరి కోసం. తల్లి ఆస్తికి ఆమె వారసురాలు కాదా!"

"అయితే ఆమె ఆస్తి ఆమె ఎక్కడున్నా వెతుక్కుంటూ వస్తుంది. ముసలాయన్ని పట్టుకు కూర్చోనక్కర లేదు"

"స్వతహాగా తాతగారు పెద్ద వయస్సులో వంటరిగా వున్నారు. ఆయనికి ఆసరాగా వుండటం తప్పా ?"

"తప్పని కాదు. ఆయనికి వంటరి తన మెందుకు ? కొడుకుల దగ్గరకో, కూతుళ్ళ దగ్గరికో వెళ్ళి దర్జాగా వుండ వచ్చును కదా! - మేడ పరులనని హజం ఎందుకు ?"

"అంత ఆస్తిపరుడు ఏమీలేని బైరాగిలా కూతుళ్ళ ఇళ్ళమ్మట, కొడుకుల ఇళ్ళమ్మట 'దేహి' అంటూ వెళ్ళి వుంటాడా చెప్పు ?"

"వాళ్ళు మటుకు ముసలాయనకు కాపలా కాస్తూ వుండాలా ?"

"నీ వాదన నీది" అన్నాడు చల పతి. భ్రమర నవ్వుకుంది.

"నీ భక్తులు ఏరీ ?" అడిగాడు.

"వసంత్ రావు, నారంగ్‌లు వాళ్ళిద్దరికీ గొడవలు వచ్చాయి. కొట్టుకుం

దకు సిద్ధపడ్డారు శలవిచ్చేసాను!"

"అంత స్నేహంగా వుండేవారు కదా ఎందుకు కొట్టుకోవటం!"

"నా మూలంగానే - నేను ఒక్కరితోనే ప్రేమగా వుండాలిట! వాళ్ళిద్దర లోనూ ఎవరినో ఒకరిని పెళ్ళిచేసుకోవాలిట. నా తప్పులన్నీ మరచి చాలా ఉదారంగా వాళ్ళ జీవితాలలో భాగం ఇస్తారుట పాపం!"

"తప్పులా? తప్పులేం చేసావు?"

"వాళ్ళ దృష్టిలో తప్పులే అనుకో"

"అవును, భ్రమరా, ఎన్ని రోజులు ఈ గాలిపటం లాంటి బ్రతుకు? ఎవర్నో ఒకర్ని పెళ్ళి చేసుకుని జీవితంలో స్థిరపడకూడదు?"

"పెళ్ళికి ఇంకా బోలెడు టయిముంటుంది. ఇప్పుడే చేసుకోవాలని తొందర ఏమిటి? అయినా మా అమ్మగారు, తాతగారు పెళ్ళికొడుకుని వెతికి పెట్టారా? మా చెల్లాయికి.... పద్దెనిమిదేళ్ళకే చేశారు కదూ పెళ్ళి? అదేదో గొప్పలా చెబుతున్నావు. ఏమీ తెలియని గొర్రె పిల్లలాంటి అమ్మాయి కదూ - ఎవడోవక డబ్బారేకుల సుబ్బారాయుడికి కాళ్ళు కడిగి కన్యాదానం చేసి ఢాం ఢాం అంటూ మేళతాళాలతో పెళ్ళి చేస్తారు. ఆ పిల్ల భర్త మాట జవదాటక పతి పాద పూజ చేసుకుంటూ నలుగురు పిల్లల్ని కని పాతికేళ్ళకే యాభయి ఏళ్ళ అనుభవంతో పండిపోతుంది. డబ్బు మస్తుగా వున్న అబ్బులయితే మళ్ళీ వధువుల కోసరం ఎరవేస్తూ 'ప్రతి రాత్రి వసంత రాత్రి' అంటూ జీవితాన్ని మళ్ళీ పండించుకోవటం మొదలుపెటారు. డబ్బు చాలని సన్యాసులయితే పస్తులతో కృంగి కృశించి పోతున్న ఆ ఎండిపోయిన ములక్కాడలతోనే శృంగార దాహం తీర్చుకుంటూ మంచివాడు, శీలవంతుడు - అనే బిరుదు ప్రదానానికి అర్హుడౌతాడు."

"నీ భావాలు ఏమిటో నాకు అర్ధం కావు"

"అందరిలో వుండే భావాలే, నేను చెబ్తూ వుంటాను. పైకి చెప్పలేక, అవకాశాలు లేక, ఒక అనాచారం. అవినీతి అంటూ పెద్ద పెద్ద కబుర్లు చెబుతారు డాంబికులు! తాము అనుభవించలేనివన్నీ పరిత్యజించాల్సినవే అని నమ్ముతున్నట్లు కనబడతారు గౌరవనీయుడు అనే ముద్రతో. భుజాల మీద శంఖు చక్రాలు మొలిచినట్లు తడుముకుంటూ మురిసిపోతారు. నాకెంతో జాలి వేస్తుంది ఈ బురఖా రాయుళ్ళని చూస్తుంటే!"

"సరేలే, ఏదేదో అంటావు! ఇంతకీ ఇంటి పట్టున వుండటానికి నీకు వచ్చిన భయం ఏమిటి?"

"నాకెందుకు భయం?"

"అయితే ఇక్కడ ఎందుకు-అక్కడికి వచ్చేయ్యి"

"వచ్చేసి ఏం చేయను?"

"పెళ్ళి పేరంటం చేసుకుని స్థిరంగా వుండు!"

"నేనిప్పుడు స్థిరంగా లేనా? అక్కడ నాకోసం పెళ్ళి కొడుకులు ఎదురుచూస్తున్నారా? అమ్మ పిచ్చికాని ఇంకా సుమనకి వెతకాలి. తర్వాత శీల మాలల సంగతి చూడాలి! ఒక పిల్ల అయినా తన మీద 'బర్డెన్'

పెట్టకుండా స్వతంత్రంగా బ్రతక
గలిగినందులకు సంతోషించాలి. కాని
ఇల్లా ఏదో కష్టాల కడలిలో నేను
మునిగిపోతున్నట్లు గోల చేయట
మెందుకు?"

"అయితే ఇంకా పెళ్ళి చేసుకోవా?"

"ఏమిటంత శరంగా అడుగు
తున్నావు? నువ్వు సిద్దంగా వున్నావా
నన్ను పెళ్ళి చేసుకుందుకు, ముందు
అది చెప్పు!"

"వున్నానో లేదో నీకు తెలియదా?
ఇన్నిరోజుల స్నేహంతో ఆ మాత్రం
తెలియదా?"

"తెలిసిందిలే! అయినా నాకిప్పు
డేమంత తొందరగా లేదు."

"ఎన్నిరోజులు ఇల్లా విచ్చలవిడిగా
తిరుగుతావు? ఓ ఇల్లూ వాకిలీ అంటూ
లేకుండా ఎవళ్ళతో పడితే వాళ్ళతో
ఇల్లాగ.."

"ఎన్నాళ్ళు తిరుగుతావు? ఫిల్
అప్ ది బ్లాంక్స్! కరక్టేనా! ఇల్లాంటి
విచ్చలవిడిగా తిరిగేదానిని కట్టిపడె
య్యాలని ఎందుకంత ఆరాటపడతావు?
నాకిల్లూ వాకిలీ లేదా? నేను వండేది
వంట కాదా? తినేది తిండి కాదా?
అయినా నాలాంటి దాని మాట పట్టు
కుని నీలాంటి గౌరవనీయుడు, మర్యా
దస్థుడు ఇంత దూరం పరిగెత్తుకు
రావటం నాకు చాలా ఆశ్చర్యంగా,
కొంచెం గర్వంగా కూడా వుందోయ్!"

"చిన్నప్పటి స్నేహం - మా
తాతగారి ఉప్పుతిని బ్రతికిన ప్రాణం!
దానికి కృతజ్ఞతగా నిన్ను ఒక దోవ
లోనికి తీసుకురావటం నా కర్తవ్యం.
భ్రమరా! నీవు నా వెంటవస్తే నేను
ఋణవిముక్తుడుని అవుతాను. కొంచెం
సహకరించు నాతో" అన్నాడు.

"ఇప్పుడు దోవలో లేనా ఏమిటి?
అయినా, పతీ, కేవలం నీవు
తాతగారి ఋణం తీర్చుకోవటం
కోసమేనా నన్ను పెళ్ళి చేసుకుంటా
నంటున్నావు? పెళ్ళి అనేది ఇద్దరి
మనస్సులు, శరీరములు ఏకమవ్వాలనే
కాంక్ష వుంటేనే, ఆ జీవితం పంచు
కోవటంలో, ఆనందం అమరత్వం
వుంటాయి. ఎవరిమీదనో కృతజ్ఞతలు
తెలుపుకోవటానికి నన్ను పెళ్ళి
చేసుకోవటం ఏమిటి? అందువల్ల
నాకేం సుఖం వుంటుంది?"

"కేవలం కృతజ్ఞతా భారం వల్లనే
కాదు, భ్రమరా! నాకు నీ మీద
అభిమానం ప్రేమ వున్నాయి. అందుకనే
నీవు పిలవగానే పరిగెట్టుకుని
వచ్చాను!"

"అంత నిజంగా ప్రేమ వుంటే,
మా నాన్నగారు రమ్మని వ్రాయగానే
ఎందుకు పరుగెట్టుకు వెళ్ళిపోయావు?
నీకు గౌరవం కావాలి. గౌరవం మీద
మమకారంతో నామీద ప్రేమ ఓడి
పోయింది. అది తెలుసుకోలేని మూర్ఖు
రాలిని కాదయ్యా బాబూ! ఇంక
రావటం అంటావా? తాతగారి ఉప్పు
తిని పెరుగుతున్న ప్రాణం, రాక
పోతుందా?" అంది.

"నీ నోటికి తాళం లేదు"
అన్నాడు ముఖం చెండుకుని.

"వాక్స్వాతంత్ర్యం వుంది నాయినా,
నాకెప్పుడయినా పెళ్ళి చేసుకోవాలని!

అన్పించితే ముందు నీకే తెలియ పరుచుతాను. సరేనా! వూరికే బెంగ పెట్టుకోకు!" అంది భ్రమర.

"సరే! రెండు టికెట్లు తెచ్చాను. ఒకసారి ఇంటికి రా! నాలుగు పూటలు వుండి వచ్చేద్దువు కాని! అయినా ఇల్లు ఇంకొకళ్ళకి ఇచ్చేసావుగా - ఎక్కడ వుంటావు?"

"కేశవన్ దగ్గర వుండిపోవటానికి నిశ్చయించుకున్నాను. ఆయన నా షరతులన్నిటికీ ఒప్పుకున్నాడు."

"ఆయన మంచివాడు కాదన్నావు అప్పుడు!"

"అవసరం లేక మంచివాడు కాద న్నాను. ఇప్పుడు నాకవసరంగా వుంది. ఆపద్బాంధవుడు అయినాడు."

"ఏమిటా అవసరం!"

"నువ్వు తీర్చలేని, తీర్చకూడని అవసరంలే" అంది భ్రమర. చల పతితో బాబూరావుని ప్రయాణం చేయించింది.

"బాబూని అమ్మకి అప్పచెప్పు. చాలా మంచివాడు. బుద్ధిగా చదువుకో బాబూ. నా మీద ప్రేమ వుందన్నావు కదా, చలపతీ, పావలా వంతు ఇతని మీద ఖర్చుపెట్టు. కాస్త మంచీ చెడ్డ కనుక్కుంటూ వుంటాడు" అంది భ్రమర.

"ప్రణామ్, దేదీ" అంటూ భ్రమర కాళ్ళమీద పడ్డాడు బాబూరావు. ట్రయిన్ వరకూ వచ్చింది భ్రమర. ట్రయిన్ కదిలిపోతుంటే బాబూరావు కళ్ళల్లో తడి కన్పించింది.

(ఇంకా వుంది

# ముఖచిత్రం

రెండు వందల సంవత్సరాల చరిత్రలో బొల్షాయ్ థియేటర్ మొదట సారిగా దేశం వెలుపల ప్రదర్శన విస్తోంది. ఈ బృందంలోని 257 గురు లోను వందమంది ఆర్కెస్ట్రా. ఢిల్లీలో 10, బొంబాయిలో 9, బెంగుళూరులో 5, కలకత్తాలో 14 ప్రదర్శనలిస్తు న్నారు. మద్రాసులో ఈ బాలెకి అను వైన హాలు లేదు. .... బాలె అనగా సంగీత నృత్య నాటిక - మ్యూజిక్, డాన్స్, డ్రామా ఈ మూడూ సమ్మిళి తమై ఉండాలి. నాటకీయత లోపించ కూడదు, నాట్య విద్య లోపించకూడదు. శ్రావ్యమైన సంగీతంలో ఈ రెండు కలిసిపోయి త్రివేణి సంగమమవాలి.... బొల్షాయ్ థియేటర్ చరిత్రలో 1927 నాటి 'రెడ్ పాపీ' (Red Poppy) ఒక మైలు రాయి .... ఆ తర్వాత 1964లో యూరీ గ్రిగొరవిచ్ (Yuri Grigo-Rovich) బయట ప్రపంచంలోని కళాప్రభావాలని, నిరాటంకంగా లోనికి రానిచ్చి, బొల్షాయ్ థియేటర్‌కి ప్రతిష్ఠ తెచ్చాడు. అనా కెరనినా, స్పార్టాకస్, స్లీపింగ్ బ్యూటీ, స్వాన్ లేక్, రోమియో అండ్ జులియట్ మాక్ బెత్ వంటివి రష్యన్ బాలెకి జగద్విఖ్యాతిని చేకూర్చాయి. సంగీత నృత్య నాటకం లో మాటల్లేకుండా వ్యక్తమయే మధుర భాషలో మనోభావాలను అతి లలితంగా చెప్పే నాట్యభామిని ఆ ముఖచిత్ర సుందరి.

సీరియల్

# 'ప్రతి గురువారం'

భార్యా భర్తలు ఒక చిన్న ఊర్లో ఒక చిన్న వారపత్రిక నడపడంలోని సాధక బాధకాలు చెబుతోంది జేన్ మెక్లవిన్. అడ్వర్టయిజర్ ఎప్పుడూ రైటే అతనితో వాదించకూడదు - అని భార్యాకు హితవు బోధిస్తాడు బాబ్ .... ఇక చదవండి.

హైస్కూలు పిల్లలకి 'డిజ్జీ' అను ఒక అమ్మాయి వీక్లీకాలమ్ రాస్తూండేది. డిజ్జీ అంటే, ఆమె టీచర్లకి మినహా మిగతా పిల్లలందరికీ యిష్టం. ఆమె రాసేమాటలు కొన్ని మాకు అర్ధమయేవి కాదు; కాని స్కూలు పిల్లలకి బాగా అర్ధమయేవి. అంచేత, ఒక్క ముక్కకూడ తీసెయ్యకుండా, ఆమె రాసినది రాసినట్లు అచ్చుకిచ్చేవాళ్లం. ఒకసారి ప్రిన్స్‌పాల్ వచ్చి 'స్టు' (Stew)లో జడపిన్ను కనిపించిందని రాయడం తమకి అప్రతిష్ట అంది. 'నిజమేగాని, ఆ మాటల్లో ఆ అర్ధం వుందని మీరు చెప్పేదాకా మాకే తెలియదు - మిగతా పెద్ద వాళ్లకి మాత్రం ఏమర్ధ మవుతుంది లెద్దురూ! డిజ్జీ రాసేదేమిటో అర్ధం కాదు గనక, పెద్ద వాళ్లెప్పుడూ ఆ కాలమ్ చదవరు' - అని ఆమెని సంతృప్తి పరిచి పంపించేశాడు బాబ్.

మా పత్రికలో సంగ్రహ ప్రకటనలొకటి - మహా తమాషాగా ఉండేవి. 'అర్కయివ్'ని, వృద్ధిలోకి తీసుకొచ్చేందుకు మాకు బోలెడన్ని ఐడియాస్ ఉండేవి; కాని, వాటిని ఆచరణలో పెట్టేందుకు టైము వుండేది కాదు. టెలిఫోను సంభాషణ, వార్తా సేకరణ - వాటి మధ్య యమవేగంతో రాసేవాళ్లం, ఆ రాయవలసినది కాస్తా! చివరికి ఈ ప్రకటన వేశాం.

"చాలా ఉత్సాహవంతమైన ఉద్యోగం – పర్మనెంటు ఉద్యోగం. అర్కయివ్ పత్రికలో ఖాళీగా ఉంది. స్త్రీగాని పురుషుడు గాని - వయసులో వున్నా వయసు మళ్లినా, ఎదిగిన మనిషి (Mature) అయితే చాలు, మాకు పని కొస్తారు. బాధ్యత నెత్తిమీద వేసుకోవాలి. టైపింగూ పద్దులు రాయడమూ వచ్చి వుండాలి. అన్నిటికీ మించి, ఆఫీసు టైము ఉదయం 9 గంటల నుంచి సాయింత్రం 5 గంటలదాకా మాత్రమేనని అనుకోని మనిషై వుండాలి. పై ఉద్యోగం కావలసినవారు, ఎడిటర్‌ని స్వయంగా వచ్చి చూడవచ్చు. దరఖాస్తులు అనవసరం"

మా ప్రార్ధనలకి సమాధానమా అన్నట్టు బార్బరా హిల్‌మాన్ వచ్చింది. ఆమె హైస్కూలు లెక్కల

మేస్టారి పెళ్లాం. బార్బరా అయిదేళ్ళ పాటు, మా బరువులో కొంత, తన నెత్తిని పెట్టుకుంది. మిగతా ఆర్టికల్స్ రాసుకునేందుకు, యింటర్వ్యూలకి మాకు కొద్దిగా వ్యవధి దొరికింది.

బార్బరాకి సంగ్రహ ప్రకటనలంటే చాలా యిష్టం. మా పత్రికలో ప్రవేశించాక, ఏడు వారాలపాటు ఒక చక్కటి ప్రకటన వేసింది — వ్యక్తిగత ప్రకటన (*Personal*) అను హెడ్డింగ్ కింద.

మొదటి రెండు వారాలు ఈ విధంగా :

"డోరిస్ : ఇంటికి రా. ఇంత చిన్న కారణానికిగాను, నువ్వు యిల్లు వొదిలి వెళ్లిపోవడం ఏమంత మంచి పని ! ఇల్లు నానా గందరగోళంగానూ వుంది. పిల్లలు నీకోసం బెంగ పెట్టుకున్నారు .... ఆర్థర్."

"డోరిస్ : నువ్వు ఎక్కడ వున్నావో వెంటనే తెలియపరుచు అందోళన పడుతున్నారు - ఆర్థర్"

ఆఖరి వారం ప్రకటన :

"డోరీస్ : వొప్పుకుంటాను. నువ్వే నెగ్గావు, ఆర్కాయివ్ పత్రికకి చందా కట్టాను. నీకు కావలసిన వార్తలూ విశేషాలూ చదువుకోవచ్చు. ఇప్పుడైనా, నామాట విని, యింటికి రావూ ? - ఆర్థర్"

నేను ఆర్కాయివ్ గురించి యిటువంటి ప్రకటన రాశాను :

అమ్మాయిలు - ఆర్కాయివ్

మునుపటి కంటె ఆరోగ్యంగాను, శక్తివంతంగాను ఉన్నారు. ఒకసారి కన్నెత్తి చూస్తే - ఆ అందచందాలు అగుపిస్తాయి. పాతబడిపోతే ఎవరికి అక్కర్లేదు. వెళ్లినచోటుకల్లా వార్తలు మోసుకు వెళ్తారు - కాని మనసు విప్పి నిర్మొగమాటంగా చెప్పరు; ఎంత చెప్పడం మంచిదో అంతే చెబుతారు. ప్రతివాళ్లూ తమకొకటి ఉండాలనుకోవాలిగాని పక్క చూపులు చూడకూడదు. అంచేత, ఆర్కాయివ్‌కి నేడే చందా కట్టండి.

## 10

విలియమ్ ఎలెన్ వైట్ ఒకసారి రాశాడు : చివరికి మిగిలేది ప్రజాభిప్రాయమేనని. ఈ ప్రజాభిప్రాయం వుంది చూశారూ, యిది అందీ అందని వస్తువు. యడ్వర్టయిజర్లు మనకి యడ్వర్టయిజ్‌మెంటు యిచ్చినట్టే మాట్లాడుతారు - కాని యివ్వరు. అలాగే, పాఠకులకి వారివారి స్వంత అభిప్రాయాలు వుంటాయనీ, వారి దృక్పథమూ వారి అభిప్రాయాలూ కాలక్రమేణా వారు తెలుపుతారనీ మేము అనుకుంటూ వచ్చాం. కొత్త శీర్షికలు ప్రవేశపెట్టాం; ఒక సంచికకంటె మరొక సంచిక బావుండాలని కృషి చేస్తున్నాం; మా శక్తికొద్దీ శ్రమపడుతున్నాం. బజారు అమ్మకం పెరుగుతున్నంతసేపూ మా పత్రికగురించి ఎటువంటి వ్యాఖ్యానాలూ రాలేదు; బాగానే వుందనుకున్నాం. కాని, ప్రజాభిప్రాయమేమిటో తెలుసుకునే సావకాశం లేకపోయింది. (ఇంకా వుంది)

